# శ్రీ కౌముదీ మహోత్సవము



(విజ్జికా విరచితము)

అనువాదకులు

శ్రీ దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ.. (ఆనర్సు)

ప్రధానాంధ్రోపన్యాసకులు,

మిసెస్. ఏ. వి. ఎన్. కళాశాల, విశాఖపట్టణము.



= ప్రచురణ =

కళాపీఠము

= బెజవాడ =

# ఉపోద్ఘాతము

ఈ నాటకము కౌముదీ మహోత్సవమను పేరఁ బరఁగు నొక సంస్కృత నాటకమున కాంధ్రీకరణము. ఈ సంస్కృత నాటకము ప్రప్రథమమున నాంధ్రదేశైతిహాసిక పరిశోధన సంఘము వారి పత్రికలోఁ బ్రకటింపఁబడినది. మూల తాళపత్రప్రతిలోని స్థాపనలో గ్రంథకర్తనామమును సూచించు నక్షరములు క్రిమిదష్టములై యుండుటచే నిది యత్కర్తృకమో చెప్పుట కాధారము లేకున్నది. కాని క్రిమిదష్టమైన భాగమున రెండక్షరముల కంటె నధికముగాఁ బట్టుట కవకాశము లేకపోవుట చేతను, దాని తరువాత 'కయా నిబద్ధ'మ్మని యుండుటచేతను దీనిని రచించిన యామె స్త్రీయనియుఁ దన్నామము త్ర్యక్షర పరిమితమనియుఁ జెప్పుటకు వీలు కలుగుచున్నది. క్రిమిదష్టమైన భాగమును సూక్ష్మముగాఁ బరిశీలింపఁగాఁ, బోయిన యక్షరములలో రెండవది ద్విత్వజ కారముగాఁ గాన వచ్చుటచే నానామము విజ్జికయని యూహింపఁ బడినది.

కాని యిట్లనుకొనుటలోఁ గొన్ని చిక్కులు కలవు. సంస్కృత నాటకమునఁ జతుర్థాంకము నందలి పందొమ్మిదవ శ్లోకమున విజయాశబ్దము ప్రముఖముగా వాడఁబడినది. విజ్జశబ్దము విద్యాశబ్దమునకుఁ బ్రాకృతరూపము. దీనికిని విజయా శబ్దమునకును నెట్టి సంబంధమును లేదు. పై పందొమ్మిదవ శ్లోకమునందే యనంతనారాయణ పదము కూడఁ గలదు. అనంతనారాయణుఁడు తిరువనంతపురము నందలి ముఖ్యదైవతము. అనంతనారాయణుఁడను పేరుగల చంద్రికా జనమేజయకర్తయు నొక్కఁడు కలడు. ఈ శబ్దములను బట్టి కౌముదీ మహోత్సవము విజయాకర్తృకమని కొందఱును ననంతనారాయణ కర్తృకమని మఱికొందఱును నూహించుచున్నారు.

ఇట్లే భరతవాక్యమునందు నీలకంఠపదము ప్రముఖముగా వాడఁబడి యున్నది. భాసుని భారత నాటకములతో విశేష సామ్యముకల కల్యాణ సౌగంధిక నాటకము నీలకంఠకవి కృతముగాఁ జెప్పఁబడుచున్నది. ఈ నీలకంఠుఁడు క్రీ. శ. 850 ప్రాంతమున నుండెనని చెప్పవచ్చును. ఇతఁడే కౌముదీ మహోత్సవ కర్తయై యుండవచ్చునని మఱికొందఱి యూహ. కాని నీలకంఠానంత నారాయణుల శైలికిని, కౌముదీ మహోత్సవము నందలి శైలికిని, విశేషతారతమ్య ముండుటచే నట్టి యూహల కేవిధమైన

యాధారమును లేదు. ఇంక మనకుఁ దెలిసినంత వఱకీ నాటకము పేరుతోఁ గాని, పేరులేకుండఁ గాని యెచ్చటను నుదాహరింపఁబడియుండలేదు. రచనా విశేషమునుబట్టి చూడ; నిది యొక మహాకవి యారంభప్రయత్నముగా గోచరించుచున్నది.

సరళమైన వస్తువునుబట్టియు, సహజ సులభమైన శైలినిబట్టియుఁ జూడ; నీ నాటకము క్రీ. శ. 5, 7 శతాబ్దులనడుమ రచింపఁబడియుండినట్లు కానిపించుచున్నది. కవి యెవరైనను గాళిదాస భారవులను బాగుగాఁ జదివినవాఁడే యనుటకు 'శైలేయగంధని శిలాతలే, విషయేషు పర్యంత పరితాపనాత్' అను ప్రయోగములు క్రమముగా దృష్టాంతములు.

నాటక నామము :— స్థాపనలో నాటకనామము పేర్కొనఁబడియుండలేదు. నాటకము పేరును గాని, నాటక కర్తయొక్క పేరునుగాని సూచించు గద్యకూడ నాటకాంతమునఁ గానరాదు. తాళపత్ర లేఖకుఁడు నాటకాంతమునఁ దత్కథతో నెట్టి సంబంధమును లేకుండనే కౌముదీ మహోత్సవమని వ్రాసియుండుటచే నీ నాటకమా పేరఁ బరగియుండవచ్చునని యూహింపఁబడినది. స్థాపనలోని 'పునరయ మపరః ప్రత్యాసీదతి కౌముదీ మహోత్సవ' యను సూత్రధార వచన మీ యూహను బలపఱచుచున్నది. పాటలీపుత్రమునఁ గౌముదీ మహోత్సవ మను పేర నొక శారదోత్సవము ప్రతిసంవత్సరమును బ్రవర్తిల్లుచుండెను. దానికి ముద్రారాక్షసమున నిదర్శనముకలదు. కాని సూత్రధార భాషణమునందలి పునః, అపరః అను పదము లీ యుత్సవము దానికంటె భిన్నమైనదని సూచించుచున్నవి. సంపాదకులు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున కీ నాటకముయొక్క లిఖిత ప్రతిని దెచ్చునప్పుడు దీనిని కౌముదీ మహోత్సవమని పేర్కొనియుంటచే నా నామమే తరువాతను దీనికి స్థిరపడినది.

నాటక వస్తువు :—నాయికా నాయకుల ప్రణయ వ్యాపారముతో గూడిన యొక సాధారణ చారిత్రక విషయ, మీ నాటకమందలి వస్తువు. మగధరాజైన సుందరవర్మకు దండనాథుఁడుగా నుండిన చండసేనుఁడు తన ప్రభువు వంశమునకుఁ జిరకాల శత్రువులైన లిచ్ఛవులతోఁ గుట్రపన్ని వారితోఁగూడి పాటలీపుత్రముపై దండెత్తెను. అప్పుడు జరిగిన మహాయుద్ధమున సుందరవర్మ నిహతుఁడయ్యెను. చండసేనుఁడు మగధ రాజయ్యెను. సుందరవర్మ మంత్రియైన మంత్రిగుప్తుఁడు రాకొమరుఁడైన కల్యాణ

వర్మను మఱికొందఱు మంత్రిసూనులతో వింధ్యపర్వతమునందలి పంపా నావాక ప్రదేశమునఁ జేర్చి తాను వివిధములైన ప్రచ్ఛన్న వేషములతోఁ దన స్వామి కుమారునకు సింహాసనము సంపాదించుటకై ప్రయత్నించుచుండెను. కొన్ని యేండ్లు కడచిన పిమ్మట నాతఁడు సేనలను సమకూర్చుకొని చండసేన హతకు నోడించి కల్యాణవర్మను మగధసింహాసనమునఁ బట్టాభిషిక్తుఁ గావించెను. ఈ నాటక మా పట్టాభిషేక సమయముననే ప్రదర్శింపఁబడెను.

మంత్రగుప్తుని రాజకీయ తంత్రముతో నీ నాటకమున నొక ప్రణయ గాథకూడ మిశ్రితమై యున్నది. శూరసేనాధిపుఁడైన కీర్తిసేనుని కూఁతురు కీర్తిమతి తండ్రి యానతి ననుసరించి వింధ్యపర్వత వాసినియైన వింధ్యవాసినీ దేవత నుపాసించుటకై - యోగసిద్ధియను నొక పరివ్రాజికతోఁగూడ నరిగెను. ఈ పరివ్రాజిక యంతకుమున్ను పాటలీపుత్రమునఁ గల్యాణవర్మకు ధాత్రియై యుండి యాతని తండ్రియైన సుందరవర్మ మరణానంతరమైహిక విషయాసక్తి నుజ్జగించి, వివిధములైన పుణ్యక్షేత్రముల సేవించుటకై పోయెను. ఆమె యిట్లు పుణ్యతీర్థాటనము గావించుచు నిచ్చట కేతెంచ, కీర్తిసేనుని మహిషి యామె నెయ్యముగ నాదరించి తన కూఁతు సంరక్షణ మంతయు నామె యధీనము గావించెను. యోగసిద్ధి, లౌకిక విషయ సంగమును బూర్తిగ నుజ్జగింపఁదలంచినదయ్యు. నా రాజపుత్రియందలి యధికమైన యనురాగమునచే మఱల నైహిక కార్యములలో మగ్నతఁ గాంచవలసి వచ్చెను.

కీర్తిమత్యాదులు వింధ్యవాసినీదేవి నారాధించి వచ్చుచు మార్గాయాస వశమునఁ ద్రోవలో నొక చెట్టునీడ విశ్రమింపఁదలఁచి యటకేగఁ గార్యాంతరాసక్తిచే నంతకుముందే యట విశ్రమించి యుండిన నాయకుఁడును నాయికయు యాదృచ్ఛికముగ నొండొరులఁ గాంచుట సంభవించెను. వారి యా ప్రథమదర్శనమే ప్రణయముగాఁ బరిణమించెను. వింధ్యవాసినిచేఁ జిత్రింపఁబడిన యా ప్రియుల చిత్రపటముల నీక్షించి యోగసిద్ధి యందలి కుమారుఁడు బాల్యమునఁ దనచేఁ బెంపఁబడిన కల్యాణవర్మయే యని గుర్తించెను. పూర్వవిషయములనన్నిటి నామె స్మరించి యాతరుణులకెట్లైయిన వివాహము సమకూర్పవలెనని ప్రయత్నించెను. ఇంతలో మంత్రగుప్తుఁడు ద్రోహియైన చండసేనునిఁ జంపి కల్యాణవర్మను మగధరాజుగాఁ బ్రకటించెను. కీర్తిసేనుఁడు కల్యాణవర్మ రాజ్యసిద్ధియుఁ దన కూఁతు రాతి

నిపై వలపునిల్పుటయు నెఱింగి సంతుష్టుఁడై పురాతనమైన యొక ముత్యాల హారముతోఁ దనపురోహితుని మగధకుఁబంపి వివాహదౌత్యము జరిపించెను. కీర్తిమతి నిదివఱకే ప్రేమించి యున్నవాఁడగుటచేఁ, గల్యాణవర్మ యీ వివాహమునకు సంతోషముతో నంగీకరించెను.

నాటకవస్తు వీ విధముగాఁ గొంతవఱకు చారిత్రిక సంబంధము కలిగియున్నది. లిచ్ఛవులు మగధపై దండెత్తుట చరిత్రలో సామాన్యముగా జరుగుచుండిన విషయమే. కాని లిచ్ఛవులయొక్కయు, మాగధుల యొక్కయుఁ జరిత్ర మింకను బూర్తిగా విశృతము కాకుండుటచే నీ నాటకస్థ పాత్రలకుఁ జారిత్రిక వ్యక్తులతోఁ గల సంబంధము నిర్ణయించుట యశక్యముగా నున్నది. క్రీ. శ. 2 వ శతాబ్ది మొదలు 6 వ శతాబ్ది వఱకు మగధరాజ్యముయొక్క చరిత్ర మస్పష్టమై యున్నది. శతాబ్దికొక పర్యాయమైనను సింహాసనము పరాక్రాంతమగుట సంభవించుచుండెను. ఈకథను బట్టి నైతె మీ నాటక మెవరు రచించినదియు నెప్పుడు రచించినదియుఁ జెప్పఁజాలము. ఈ నాటక మొక మలయాల దేశీయుని యూహాకల్పితము, మాత్రము కాదని నిస్సంశయముగా నిర్ణయింపఁ జాలినను గవినాయకులలో నెవ్వరియు; దేశమునుగాని కాలమునుగాని నిర్ణయించుట కవకాశములు లేవు.

ప్రథమాంకమునందలి నాల్గవ పద్యములోని విషయములు శాలంకాయనుఁ డుదయనుని బందీకృతుం గావించిన కథతో సంబంధించి యున్నవి. సుందరపాటల ముదయనుని యశ్వము. కార్త్యాయనుఁ డాతని దండనాథుఁడు. నాగవనమున నుదయనునితో నేగిన వారిలో నీతఁడు నొక్కఁడు. వీణావాసవదత్త నాటకమున నుదయున పరాజయము వర్ణితమై యున్నది. శౌనకుఁ డను బ్రాహ్మణ యువకుఁ డొకఁ డయోధ్యా రాజకుమారియైన బంధుమతిని మోహించి యామెను రాజగృహము వీడి రమ్మని ప్రోత్సహించెను. త్రోవలో వా రొండొరులఁ గనుఁగొనఁ జాలక కొంత కష్టపడిరి కాని చివరికి మరలఁగలసి కొనిరి. అయోధ్యారాజామెను త్రిగర్తదేశాధీశున కిచ్చెదనని వాగ్దాన మిచ్చియుండుటచే నతఁ డాతనిపై దండెత్తెను. శౌనకుఁడు కొంతబలమును సమకూర్చుకొని తన మామగారి నాయాపదనుండి రక్షించెను. ఈ శౌనకుఁడే మఱుజన్మమున శూద్రకుఁడై జనించెను. ఈ కథ దండి యవంతీసుందరి కథలోఁ గలదు. అవి మారకుఁ డవిమారక మను పేరు గల భాసుని; యొక నాటకమునందలి

నాయకుఁడు. అతఁడు కురంగిని పెండ్లాడెను. వాత్స్యాయనుఁ డీదంపతులఁ జేర్చెను. ఈనాటకములో నుద్ధరింపఁబడిన యీ పైకథలను బట్టి యీ నాటకకర్త కౌముదీ మహోత్సవమునే కాక యవిమారక బంధుమతీ శౌనక వీణా వాసవదత్తములను గూడ రచించెనని యూహింప వచ్చును. కాని కేవలము శైలిని బట్టి యీవిషయమును నిర్ధారణము చేయుట కష్టము.

పూర్వకవులచేఁ దలుచుచుఁగాఁ జేర్కొనఁబడుచుండు దత్తకుఁడు, గోణికాపుత్త్రుఁడు, మూలదేవుఁడు మున్నగు వారి పేరు లీ నాటకమునందును గానవగుటచేతను, అత్యయిక దూత యను సాంకేతిక పదముయొక్క ప్రయోగముచేతను, నీనాటకము ప్రాచీనమని చెప్పుట కవకాశము కలుగుచున్నది. అవస్తీమాషము మాల్వాదేశమున నాడుకలో నుండిన యొక విధమైన నాణెము కాని నాటకమున నాపదము నుపయోగించిన పాత్ర పాటలీపుత్ర వాసియే. ఈవిషయము మూలనాటకకర్త మాల్వాదేశమునకు జెందినవాఁడై యుండునేమో యను సందేహమును గలిగించుచున్నది.

ఈ నాటకము నాంధ్రీకరించుటలో నేను మూలమును జాల సన్నిహితముగా ననుసరించితిని. మూఁడు నాలుగుచోట్ల మూలమునందలి శ్లోకములు క్లిష్టాన్వయములును దురవగాహములును నగుటచే వానిని సందర్భము ననుసరించి తెలుఁగున వివరించి వ్రాసితిని. మూలమునందలి నీచపాత్రల ప్రాకృతమునకు ఛాయ ఒక్కొక్కచో సందిగ్ధముగానున్నది. అట్టి సందిగ్ధస్థలములందు సందర్భము ననుసరించి నొంతముగాఁ గల్పించితిని. కాని యట్టి వాక్యములు రెండుకంటె నెక్కువ యుండవు. మూలనాటకమునందలి ముగింపు మిక్కిలి హఠాత్సంపతితముగను కృత్రిమముగను నున్నది. మరియొక ప్రతితోఁ బోల్చి చూచి కాని యట నెట్టిమార్పును జేయుట యుక్తముగా నుండదని దానినట్లే యుంచితిని. ఈ రచన నా ప్రథమ ప్రయత్నమగుటచేఁ బ్రమాదవశమున నిందు దొరలిన దోషములను విద్వాంసులు మన్నింతురుగాక. నే నీ యుపోద్ఘాతమునందలి విషయములను మూలగ్రంథమున కుపోద్ఘాతము వ్రాసిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి ననుసరించి వ్రాసితిని.

విశాఖపట్టణము,<br>29-8-43,

దివాకర్ల వేంకటావధాని,<br>అనువాద కర్త.



శ్రీ

# కృతజ్ఞత

**Respecufully dedicated to**

## Sri Rao Bahadur V. K. Narayanamenon,

M. B. B. S.

*Professor of Bio-chemistry, Andhra Medical College,*

**VIZAGAPATAM.**

శ్రీయుత భైషజ్యకళా, తోయధి కుంభాత్మజాత! దుఃఖిత జన సా
ఖ్యాయిత కరుణాయుత! నారాయణ మీననుశుభంక రాఖ్యాలసితా!

శ్రీనారాయణ నామకీర్తనము సంస్మృత్యామయం బీగి, భ
క్తానీకంబును బ్రోచునట్టులు రుజా వ్యాప్తాంగులౌ లోకులన్
నీ నామస్మరణంబె యబ్బురముగా నీరోగులంజేయు "వై
ద్యో నారాయణ"యన్న నా నుడికి నీతో వచ్చు సార్థక్యముల్

గురు కరుణామయుండవయి కోరినయంతనె నా శరీరమం
దిరవుకొనంగఁ జాలిన యహీన రుజాక్రమముం బరీక్ష చే
సెఱిఁగి సమంచితౌషధమునిచ్చి, ప్రశాంతి నొసంగినాఁడ వే
కరణిని నేఁ దొలంచుకొనఁ జాలుదు, నీదు ఋణమ్ము ధీమణీ!

ధేనూర్వీగృహజాత రూపవసనాదిప్రాజ్యదానంబు లీ
క్షోణిం దొల్లిటి నాఁటినుండియును వచ్చు; న్వాని నీనేర్చినా
రానందంబునఁ బెక్కు రీద్య చరితుల్ ప్రాణంబు దానంబు లే
నేనాఁడు న్విన నీకు నొక్కనికె నాయెం దద్వదాన్య ప్రథల్.

అసువుల్ నిల్పినదాత నీకొసఁగగా నర్హమ్ములౌ వస్తులే
యసదున్నం దదుపార్జన క్షమత నాయందెట్టులుఁ లేద, మా
నసికంబైన కృతజ్ఞతాభరము కొంతం దీర్చుకోఁగోరి నీ
యసమానంబగు నాదరమ్మునకుఁ గావ్యం బంకితం బిచ్చెదన్.

# శ్రీ కౌముదీమహోత్సవము

## ప్రథమాంకము

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును]

సూత్ర—

ఫణిరత్న ప్రభలీను తక్షకునిచేఁ బర్యంకబంధంబు చే
కొని, శార్దూలశుభత్వ గాస్తరముపైఁ గూర్చుండి, దీక్షాస్థలం
బున నానాత్వపుగ్రంథి విప్పుమతినాఁ బొంగార్చుచుఁ దంతకాం
తిని, ఛందోవివృతిం బొనర్చు శివుఁ డర్థి న్స్మితమం బేర్చుతన్

(పరిక్రమించి) అహో! సర్వజనులకును సమానముగా మహోత్సవమని చెప్పఁదగిన శరత్సమయము సమీపించినది. ఏలయన,

అలరు నెడందఁ జేరి కలహంసము కాంచెడి సైకతమ్ము; మం
గళమును బాడు తుమ్మెద వికాసము పొందిన తమ్మిఁ గొల్చెడిన్
బొలయగఁ జేసి దాతృయశముం ద్రిజగంబులు నిండుగర్జలన్
మెలమెల సన్నతాంబుదము మేకొనురి క్తమ యయ్యెనున్నతిన్.

మఱియు,

కర్షకకుమారి తన కరాగ్రమ్ముచేత
నమరుచుచు నున్న దిపుడు కర్ణమునయందుఁ
దన కటాక్షము పడిన కారణముచేత
నసిత శారముఁ గలమంపు టలరుగుత్తి.

పూజ్యుఁడును, పాటలీపుత్రాధి పతియు, సుగృహీతనామ ధేయుఁడునగు కల్యాణవర్మయొక్క నూతన రాజ్యలాభ ముచే మొన్న మొన్నఁటి దాఁక రాజకులమంతయు నానంద మందిరమై యుండెను. మరల నిప్పుడీ కౌముదీ మహోత్సవ సమయ మరుదెంచినది. అందుచే నేను స్వకులోచితమైన సంగీతక సేవాధికారముచే రాజకులము ప్రవేశించెదను. (ప్రవేశించి) పూర్వసూరి సూక్తి సమలంకృతములైన రూపకము లన్నియుఁ బ్రయుక్త పూర్వము లగుటచే నిప్పు డభినవ రమణీయమైన యేనాటకము నభినయించుట యుక్తముగా నుండును? అగుఁగాక. దేవరవారి సమతీత చరిత్రమునే యధికరించి (విజ్జిక) యొక్క నాటకమును నిబంధించెను. దానిని బురస్కరించుకొని యిప్పుడేను మగధ రాజాంతఃపురమును జొచ్చెదను. అచ్చట విద్వాంసులు నాకుఁ దోడ్పడఁ గలరు.

విరసంబయ్యును గృతి స
త్పురుషుల దయ యున్న యెడలఁ బొందు మధుర సో
త్కరమగు దశాంతరము భా
స్కరు నాతపమొంది శిశిరసమయమ్ము వలెన్.

(చూచి, ససంభ్రమముగా)

వరతపమ్మె శరీరమ్ము వడసినట్లు
తనరి నారలుకట్టు నీ ధామమేమొ?
స్వర్ణ రేతుఁడు వటువు వేషమ్ముఁ గొనుట
కానఁబడుఁ బౌనరుక్త్యమ్ముఁ గాంచినట్లు.

ఔను! తెలిసినది నా వలని పక్షపాతముచే బారిపార్శ్వకుఁడు తానుగా మునిశిష్య భూమికను గ్రహించి యిట్లే వచ్చుచున్నాఁడు. అందుచే నేనును ననంతర కార్యక్రమము నెఱవేర్చుటకై యరిగెదను.

(నిష్క్రమించును.)

## స్థాపన

[అటు పిమ్మట మునిశిష్యుఁడు ప్రవేశించును]

ము. శి—కులపతి యాశ్రమ పదముయొక్క సంభావన నేమని కొనియాడుదును? విద్యాపూర్తి గావించి, గురుజనానుమతుఁడై సనయస్కులతో రాకొమరుఁడు స్వకులోచిత ధర్మమును నిర్వహింప బయలుదేరిన యీ సమయమున,

అలరులరాల్చె బాష్పములన ట్లగముల్ ధర మాటిమాటికిన్,
దలలు నిగిడ్చిచూపుచను దాఁకఁగనెన్ హరిణంబు లాశ్రమం
బుల,మునులార్తిశూన్యధులు మూసికనుల్ క్షణమోడ్చిరశ్రువుల్
కులపతి కుత్తుకన్ నుడులు కుంఠితమయ్యె, గజావిలంబులై.

ఈవిధముగాఁ గుమారునుద్దేశించి చేయఁబడుటలో నాశ్చర్య మిసుమంతయు లేదు. ఏలయన,

పరమేశోక్తగతి ప్రభమ్మునడ; శ్రీవత్సాంకితమ్మా నురం;
బరికేత్వంకుశలాంచితమ్ములు పదా లాజానులంబుల్ భుజల్
స్ఫురదూర్ణా విలసల్లలామరచనన్ సొంపారు మో; మీధరే
శ్వరసూనుండు చెలంగు సర్వగుణ సంపద్గోష్ఠి కావాసమై.

(పరిక్రమించి) అడుగో! కాశ్యపాయనుఁడు.

(ఆకాశమునందు) నీవేమని అడుగుచున్నావు? కౌత్స! నీవెచ్చటినుండి వచ్చుచున్నావనియా? పంపాసరోవర సమీపమునఁ జండికాయతనమున కెదురుగాఁ గులక్రమాగతమిత్రుఁడైన కుంజరకునియొక్క నివాసమగు వ్యాధకిష్కింధమనెడి దుర్గస్థానంబునఁ బ్రతాపసమయమును బ్రతీక్షించుచుఁ బ్రచ్ఛన్నవేషమున నివసించుచున్నకుమారుని సుఖముగా సహార్యాహారము సాగించితివా? యని యడుగుటకై కులపతి యానతిచే నరిగి తిరిగివచ్చితిని. ఏమనుచున్నావు? వైరివర్గాధిష్ఠితమైన రాజ్యమును దిరిగి సంపాదించుటకై యుపాయములఁ జింతించుచుఁ బాటలీపుత్రమునకేగిన మంత్రిగుప్తుఁడింకను బ్రతాపావసరము నాపాదింపలేదా యనియా? ప్రమాద భీరుత్వముచే వివేకవంతుల కార్యసిద్ధులు కాలక్షేపసహితములై యుండును గదా! ఏమనుచున్నావు? తపఃప్రభావముచే నా కార్యసిద్ధిని గలిగింపుఁడని రాకొమరుఁడు కులపతియైన జాబాలినే ఏల ప్రార్థించియుండలేదని యడుగుచుంటివా? క్షాత్త్రమైన తేజము పరాక్రమోపనతమైన సిద్ధినే యభికాంక్షించును. ఏమనుచుంటివి? అగునది యట్లే. నీవింక నరుగుము. నేనును సమిత్కుశ కుసుమాహరణమునకై యేగెదననియా? సరే. నీవరుగుము. నేనేగి కులపతిని దర్శించెదను.

(నిష్క్రమించును)

విష్కంభకము.

[అంతటఁ గుమారుఁడు ప్రవేశించును.]

కుమా—

ఎవ్వారి యానతినెల్ల భూజానులు
తలఁదాల్చి రలరుల దండఁ బోలె;
నెవ్వారి యశము దిగీశాక్షుల యొడళ్ళఁ
బ్రకటించెఁ దెలివలి పంపుసోగను;
ఎవ్వారిపేర భూభృత్సమూహంబుల
గుండెలలోఁ జిచ్చు కుదురు కొలిపె;
నెవ్వారి నిరత దాతృత సత్కవీంద్రుల
రచనలలో నమరత వహించె;
వారు మామక పితరు లవార్య వీర్య
సంపదాహవలబ్ధ నిర్జర నివాసు
లకట! పడయరు తను తిలోదకములైన
నేది యెపుడెట్లు వచ్చునో యెవ్వఁడెఱుఁగు.

కుంజరక సకాశమునుండి ప్రియవయస్యుఁడు వైఖానసుఁ డరుదెంచువఱకు నీ తపసీ యాశోకపాదపముయొక్క నీడ యందుఁ గూర్చుండెదను.

మత్తగజ గంధదాన సంభరితములయి
భృంగ విసరానుగతములౌ వింధ్యవాయు
తతుల నిప్పుడు నా స్మృతిఁ దగులు బాల్య
భుక్త ముక్తమ్ము పాటలీపుత్ర వసతి.

(నిశ్వసించి) ఆ శైశవకథయే మాటిమాటికి స్మృతి పథమున నిల్చుచున్నది. అప్పుడు

కవచము విల్లుదాల్చి చనఁగా నలుకం బిత సర్వసిద్ధుఁడై
యవిరళ బాష్పవారి నతె నంబల చెక్కులపత్త్రి భంగముల్
నవచల కాకము ల్గలుగు నన్గొనిపోయిరి మానులొంటి శై
శవకథ నాకుఁదోఁచెడి నసత్యము నట్టిది మాయయో కలో?

కాతరజనోచితమైన ఈ నిపాతోదంత చింతవలనఁ బ్రయోజనమేమి? సంపద "తేజశ్శాలియైన పురుషుని పార్శ్వమును నీడవోలె" విపత్కాల మందైనను విడువదు. ఉదారచిత్తు లెన్నఁడును హీనత్వముం బొందరుకదా! ఏలయన

అతివేగ విజిత మారుతమైన సుందర
పాటలాశ్వమ్ము విధ్వస్తమైనఁ
బ్రాణమ్ము ప్రాణమై పరఁగు కార్త్యాయనుం
డంగరక్షకుఁడు చంపంగఁ బడిన;
గాఢాంధకార భీకరమైన ప్రద్యోతు
చెఱనివాసమ్ము సంసిద్ధమైన;
నరి విదారణదక్ష మయ్యు నాత్మ బలమ్ము
సాహాయ్య మొనరింపఁ జాలకున్న;
నాయయి యుపాయములచేత నఖిల శత్రు
గణము నిర్జించి విజయలక్ష్మిని వరించి
యధిక తేజోవిరాజి వత్సావనీశుఁ
డుదయనుండు కౌశాంబి మున్నొంద లేదె?

పాటలీపుత్త్రమున కేగిన మంత్త్రిగుప్తుఁడు దూతను దిరిగి పంపుదాకనైన నిచ్చటనుండి యప్రతి ప్రసర వంధ్య

నైన యమర్షమును నైఁప శక్తుఁడను గాక యున్నాఁడను. (నిమిత్తమును సూచించి) నాదక్షిణ బాహు వదరుచున్న దెందుచేతనో;

అరుదైశ్వర్యముఁ గన నిజ
పరివారము శోకవహ్ని పాలయి కుందుం
బౌరయుటఁ గాంచియు వామే
తర మేలొకొ? నాదు కరము తాల్పదు ధనువున్.

(శబ్దమును సూపించి) తామర తేనె త్రాగుటచే మత్తిల్లిన కలహంసల యీ నిర్భరమైన కలస్వనమెచ్చటిది! (ఆలోచించి) ఇది కలహంస కూజితముకాదు

మేఖలా మధురస్వనో న్మిశ్రితమ్ము
లలిత పాదవిన్యాస విలంబితమ్ము
నయిన యీ మంజురవము కలాలపనల
యమల మంజీర శింజిత మ్మని తలంతు.

అగుఁగాక! సవ్వడి ననుసరించి చక్షువుల సారించెదను. (అట్లుచేసి) అహో! జీవలోకము చిగిరించినదివోలెఁ గానఁబడుచున్నది. పరిమిత పరివారయై తారకాగణ పరివృతమైన చంద్రరేఖవలె గోచరించుచున్న యీ కన్నె యెవ్వరోకదా!

సిరి మథితాబ్ధి; నూర్వశి కుశేశయజాతుని యూరువందు; దాశరథి కళత్రమా జనకజామణి వాగటిచాలునందుఁ; గృష్ణ రుచిర వేది మధ్యమున సంభవమొందిరటందుఱ, కాని చూపఱకనులన్, సుధం, జిలుకు పద్మిని యెయ్యెడ నీమె పుట్టెనో?

[అంతట సఖీగణ పరివృతయైన కీర్తిమతియుఁ గాంచుకీయుఁడును బ్రవేశింతురు]

కాం—కుమారీ! ఇట్టిటులు.

కీ—సఖీ! నిపుణికా! నా హృదయము ప్రసాదము వహించిన ట్లున్న దెందుచేతనో!

ని—భర్తృదారికా! భక్తులను దయతోఁ జూచు భగవతికిఁ బాదాభివందన మొనర్చి వచ్చియుంటివి. నీ హృదయమేల ప్రసాదము వహింపదు?

కీ—కడు యుక్తముగాఁబల్కితివి. తల్లి దండ్రులయెడఁ బాటు వలనఁ గల్గిన దుఃఖముయొక్క వేదన భగవతీ దర్శనముచే నా కిప్పుడు సహింప శక్యమగుచున్నది.

ని—భగవతి యచిరకాలములోనే యనుగ్రహమును గూడఁ బ్రకటింపఁ గలదు.

కుమారుఁడు—మదనుఁడే సర్వవిధముల నీమె సంభవమునకుఁ గారణమై యుండవలయును.

ఇతరములైన సర్గముల నెల్లఁ దృణీకరణం బొనర్చు నీ
సుతనువు దేహ మా కమల సూనుని శిల్పము పంటకాదు ని
శ్చితముగ; శంకరుఁ గెలువఁ జిత్తభవుండు తపించినట్టి య
ద్భుత తప మిట్లుగాన నఘపున్ ఫలమందె నటంచు నెంచెదన్.

కీ—కోకిలల కోమలగీతములతోనిండి మెగురుచున్న జెండాలచే సొగసై, సువర్ణమయముగాఁ గానఁబడుచున్న యిది ప్రాసాదమా యేమి?

ని—చెలీ! ఇచ్చటఁ బ్రాసాదమేదియు లేదు. పూలగుత్తుల మొత్తములచే బంగారువన్నెఁ దాల్చిన కొమ్మల గములును, బిల్ల తెమ్మెరలచే నూయెల లూపఁబడిన చిగురాకు

దొప్పలును, గల్గి తేనెటీగల తీయని పాటలచే నొదకింపు గొల్పు నియ్యది యశోకవృక్షము. దీనిచే నిప్పు డీ ప్రమద వనమందలి పాదపముల సమృద్ధి చక్కఁగా వెల్లడి చేయఁబడు చున్నది.

కీ—చెలీ! దీనిక్రింద సుఖశీతలమైన ఛాయామండలము కలదా?

ని—ఇందు సందేహ మేమున్నది ?

కీ—దూరమునందుండియే నీ వెట్లు తెలిసికొంటివి?

ని—ఆకారమునందలి నమ్మకముచే నట్లు చెప్పితిని ఉన్నచో నేమి?

కీ—పిచ్చిదానా ! అలసినవారు విశ్రాంతి చేకొందురు.

ని—ఆర్య! భర్తృదారిక మిక్కిలి బడలిక చెందినది.

కాం— సిద్ధాయతనములందు వాహనారోహణాతిక్రమము పరిహరింపవలెనని కాలినడకనే బయలుదేరిన భర్తృదారిక పరిశ్రాంతురాలైనది. దేవి ! ఈ తపనీయాశోకపాదపము యొక్క నీడయందు క్షణకాలము విశ్రమింతము. అంతః పురాధికృతుఁడైన సింహాలకుఁడు స్వయముగా నావాసస్థాన మును గల్పించి యీ సంగతి తెల్పఁగలఁడు.

(అందరును బరిక్రమింతురు)

కుమా—ఇప్పుడు నా నేత్రములు చరితార్థములైనవి.

చరణమ్ముల్ కిసలాభముల్; కలభహ స్త్రశ్రీముషమ్ముల్ తొడల్;
పరపొందున్ జఘనమ్ము;మధ్య మసదో;వక్షోజముల్ పీనముల్;
కరముల్ చంపకదామధామములు; రాకాచంద్రుఁ డాస్యమ్ము;వె
న్నెరు లాత్మీ_ప్త తమమ్ము; లీమెపొడవందెన్ సర్వాకన్యాంకముల్.

(అందఱును గుమారునిం జూచి సంభ్రాంతులౌదురు.)

రాం—ఆకారబద్ధమైన యీ తేజము మహత్తరమైనది. ఏల యన నీతనిఁజూచుటతోడనే బహుదినములనుండి రాజాంతః పురముల నివసించుచున్న నాకును నప్పుడే రాజదర్శనము లభించిన వానివలె సత్త్వావష్టంభము శిథిలీభూతమైనది. ఈతఁ డెవ్వరో తెలిసికొనవలయునని కోరిక యున్నను నుపోద్ఘాతము లేకుండ నీతని నడుగుట కుత్సహింప కున్నాఁడను. అది సహజమే.

శ్రవణాంతమ్ముల విశ్రమించు కడు విస్ఫారమ్ములౌ నేత్రముల్
దవులన్ వింటి గుణమ్ము తద్ద్రణకిణాక్రాంతంబైన ముంజేయియుఁ
బావణిల్లఁ మహనీయ తేజమున కేకావాసమై, యీనృపో
ద్భవుఁ డుర్వీపతి వంశసారము సముద్ధారమ్ముగా వెల్గెడిన్.

కుమా—పూజ్యులకు స్వాగతము. మేమిచ్చటఁ బూర్వోపవిష్టుల మైతిమి. కాన పూజ్యు రాండి రిచ్చటఁ గూర్చుందురు గాక. వారికి

సురభుల్ వింధ్యమహీధ్రమత్తగజ నిశ్శ్వాసోత్కటమ్మదాసిక్తతన్,
బరిశీతమ్ములు పాంపవారి విలసద్భృంగావళీ ఘట్టనన్
దరుగం జేయుత మీవనాంత విసర ద్వాతాంకురానీకముల్
గురువక్షోజ నితంబ భారవహన క్షోభాత్తమార్గశ్రమన్.

ని—చెలీ! రాకాచంద్రమండలమునుండి వలె, నీతని మొగము నుండి యమృతరస నిష్యంద మొలుకుచున్నది.

శ్రీ—(ఆత్మగతము) ఈతనివంకఁ జూచు జనుల హృదయములు కూడఁ జంద్రకాంత శిలామయము లట్టు లమృతరస నిష్యంద నిర్భరము లగును. (ప్రకాశముగా) చెలీ! నీవు ముందుండుము.

ని—అపూర్వ పురుష సందర్శనముచే భర్తృదారిక మొగ మింతయు వికసింపలేదు. (అపవారించి, చిఱునవ్వుతో) చెలీ! "పద్మిని చంద్రదర్శనమును బరిహరించు"ననెడి లోక ప్రవాద మిప్పుడు సత్యముగాఁ దోచుచున్నది.

కీ—(బొమముడిపాటుతోఁడి వక్రదృష్టులతో నిపుణికను జూచును)

కుమా—ఆర్యా! విస్మయనీయ దర్శనములు కుతూహల స్థానములై యుండునుగదా!

ఆకారమే యీమె రాజవంశ సంభూతిని జెప్పక చెప్పుచున్నది. కాని;

సుగృహీత నాములగు నే
జగతీశుల కులము నీ విశాంపతిసుత శ్రీ
భగవతి సాగర వంశము
తెగఁదన జన్మోత్సవమున దీప్తము చేయుః.

కాం—మహాశయా! వినుము. శూరసేనమను పేరుగల దేశము కలదు. విఖ్యాతయశస్కుఁడైన కీర్తిషేణ మహారాజు దానికి రాజు.

నృపతుల్ కొందఱు మన్యునాగ మితరుల్ నీతి గ్రహావగ్రహం,
బపరుల్ సైన్యరజః పిశాచగణ రుద్ధాశాంతముల్, గాంచి తం
త్రపరిజ్ఞాని, నరేంద్రశేఖరుఁడు నీ రాజేంద్రు శ్రీమత్పదా
బ్జ పరాగంబు ధరింతు రౌదలల రక్షాభూతి నానముగ్రలై.

కు—శూరసేనాధిపుఁడైన కీర్తిషేణ మహీపాలుని గూర్చి వింటిమి. ఆయన మధ్యమ మహీపాలక పురందరుఁడు గదా! తరువాత, తరువాత!

కాం—కీర్తిమతి యను పేరుగల్గిన యీమె యాయనకుఁ బ్రాణముల కంటెను బ్రియురాలైన తనూజ;

కు—హిమవంతమునుండి భాగీరథియే జన్మించును. కాని

మణిమంజీర మృదుధ్వని న్మొరయు హంసమ్ముల్లలెం, బొల్చు, ప త్తన సౌధాగ్ర విహారపేశలతకుం దావైన పాదమ్ము లీ జనసాథాత్మజ మోప నేమికతమో సాంద్ర ప్రరూఢమ్ములౌ వనదర్భాంకుర కంటకాళుల దురాపంబౌ తపోభూములన్.

కాం—అయినచో దీనినిగూడ వినుఁడు

ఈమె శైశవలీలల నెల్లఁగడచి
యౌవనారంభ సంపర్క మలరుకతనఁ
"గోవిదుని విద్య శిక్షణ గుణ విశేష
సంగతినివోలె" ననదృశచ్ఛాయ నూనె.

కు—అటుపిమ్మట;

కాం—పిమ్మటఁ బ్రతిపన్న యౌవనలైన కన్నియలకుఁ బితరులు చేయఁదగిన దీమెకు భగవత్యనుమతమైన మార్గము ననే జరుగుఁగాకయని నిశ్చయించి, యదునాథుఁడు "చండికాయతనమున కేగి భగవతియైన వింధ్యవాసినిని గొన్ని దినము లారాధింతువుగాక" యని తాఁగాఁ గూతునకుఁ జెప్పి, సపరివారముగా నీమె నిచ్చటికిఁ బంపియుండెను. నీకు భద్రమగుఁగాక.

కుమా—పూజ్యుఁడైన మధురేశ్వరుఁ డశక్యారంభ మొనరింపఁ బూనినవాఁడు వలెఁ దోఁచుచున్నాఁడు.

ఆతపతుషార వాతమ్ము లరయ మాత్రి
కాంతి విప్లవమందు నీకన్నె మేను;
సుమవన శిరీష కుసుమ భాసురము దీని
నాతప క్లేశ సహముగా నాచరించి.

కీర్తి—(తనలో) అయ్యో! హృదయము యొక్క ధీరత్వ మేమని చెప్పను? జనులచే నడ్డగింపఁ బడిన దయ్యె దృష్టి మాటి మాటికి నచ్చటనే పడుచున్నది.

చేటి—భర్తృదారికకు జయ మగుఁగాక, "ఆవాస స్థానము కల్పింపఁబడినది. ఈ ముహూర్తమే భగవతియైన యోగ సిద్ధి కభిమతమైనద"ని మస్తక న్యస్తాంజలిపుటుఁడై సింహా లకుఁడు విజ్ఞాపనము చేయుచున్నాఁడు.

కాం—దేవి! ఆ మహానుభావుని సెలవు పొందుము. మన మింక నరుగ వలయును.

కుమా—వెళ్లి పునర్దర్శన మొసంగుదురు గాక. ఆనుషంగిక దృష్టుఁడైన యీ జనుఁడు విస్మరణీయుఁడు కాఁడు.

కీర్తి—(కుమారునిఁ గడకంటఁ జూచుచు సపరివారముగా నిష్క్రమించును.)

కుమా—

హృదయమున రాగమును వెల్వరించి ముడుగు
కన్నొమల నందమగు కటాక్షముల తోడ
నరిగియును బ్రియ నామనంబాచి కొనెడి
దనదు నాత్మను నాయందుఁ దావు కొలిపి.

అదిగో! దారి నడుమనున్న యీ లత యామెకు మార్గా వరోధము కలిగించు చున్నది. అయినను,

మనసిజు సర్వవైభవ మమర్చు సముద్గములైన పీవర
స్తనముల మేటిభారమున సన్నతమై తగునంగయష్టితో
డను, విటపమ్ములం దగులుటం జలియింపగ నుత్తరీయ మా
ననమునువెన్కకు న్మలంచినానయనామృత మేగిపోయెడిన్.

మోముతావికై మూసరుచున్న తుమ్మెద గోదమను లీలారవిందముచే నదలించుచు, నక్కటా! యామె దట్టమైన చెట్లనడుమ నంతర్హితురాలైనది.

గురు జఘన భారమున నా
హరిణాంబక దూరదూర మరిగెడి గోలందిన్
వరగాత్రి నాదు హృదయాం
తరమును బరిగాఢ గాఢతరముగఁ జొచ్చెన్.

విదూ— మగధ ప్రత్యంతవాసులైన శబరపుళిందులకడ కార్య మంత్రిగుప్తుఁడెట్లు చెప్పెనో? యట్లే జరుగవలయు నని చెప్పుటకై కుంజరకుఁడొక్క సేవకునిఁబంపి యుండెను. ఇంక నేను జండికాయతన జీర్ణోద్యానమందున్న ప్రియ వయస్యునిఁ జూడఁబోయెదను. (సమీపించి) వయస్యునకు జయమగుఁగాక.

కుమా—(విదూషకునిఁజేతఁ బట్టుకొని) మిత్రమా! వైఖానసా!

స్వప్నమున యందుఁ బొందఁ గఁబడిన లక్ష్మి
నవ్య సముపాత్తగంధర్వ నగర రేఖ
యట్లె ప్రాదుర్భవించి నృపాత్మజాత
తిరిగి తత్క్షణమంద యదృశ్యయయ్యె.

విదూ—ఆరాజ తనూజ యెవ్వరు?

కుమా—(చెవిలో రహస్యముగా చెప్పును.)
విదూ—హా! గుడ్డివాడు నూతఁబడుట సంభవించినది
మొదట రాజ్యనాశనము; పిమ్మట నారీపాశబంధనము.
కుమా—వైఖానసా! అట్లుకా దట్లుకాదు.

మృగచపలాక్షి యప్పుగిది నేగెడువేళ నొకింతసేపు నా
కగపడె రోమరాజి యురమందలి యంశుక మోసరిల్లఁగా
జగములనెల్ల గెల్వ సుమసాయక దేవుఁడు వింటినారిగాఁ
దగిలిచినట్టి షట్పదవితానము బా రనఁగా సుహృన్మణీ!

విదూ—హీం! హీం! చూడుము. చూడుము. పూలవలె నిర్మలమై
యోదఃరాశి కానుపించుచున్నది.
కుమా—(చూచి) కాంతులఁ గుమ్మరించునయ్యది లతకుఁ
దగుల్కొని పడిన యామె ముత్యాలహారము.
విదూ—ఔనౌను. అది ముత్యాలహారమే. ఆఁకలిఁగొన్న నా
కది యన్నరాశివలెఁ గానిపించినది.

కుమా—(హారమును గ్రహించి)

పయనమగువేళ సంభ్రమవశముచేత
విడువఁబడి ముత్తియమ్ముల పోడవుతాల్చి
తిరిగివచ్చినదామె చేమఱువఁబడిన
హృదయమేమొకో? చూడు మొక్కింత సుహృద!

విదూ—మిత్రమా! పరకీయమైన యీ వస్తువును గ్రహిం
చిన, మనము దొంగలమగుదుము.
కుమా—వయస్య! అట్లుకా దట్లుకాదు. మనకు దీనితోఁ
బ్రయోజనము కలదు.

అమర మందార సుమగుచ్ఛ హారుఁడైన
నడిమి మణికాంతులను నరుణత్వ మొంది
శ్రీవిలాసాబ్జ నాళ సుశ్రీవహించు
హారమిది యాత ఁమాంగళ్య కారణమ్ము.

చేటు—(ప్రవేశించి) దేవరవారికి జయమగుఁగాక. గృహీత సంభారమైన వయస్య గణము వ్యాయామ శాలయందు దేవరకై ప్రతీక్షించుచున్నది.

విదూ—లెమ్ము లెమ్ము. వ్యాయామ శాలకేఁగుటకు వేళయైనది,

(అందఱును బరిక్రమింతురు.)

కుమా—

ఆమెనే యనుసరించుచు నామనమ్ము
ముక్త మూలంబగుచు నాశముం బొరసెడి
"స్రోతమాయతయైయుండు హేతువునను"
"హ్రదము నందలి వారి సంపద విధాన".

మఱియు,

వనజదళాక్షి పీనకుచ భారము నుమ్మనుద ప్తమైనటుల్
ఘనజఘనస్థలమ్ము పృథులత్వముచే నవసన్నమైనటుల్
కనదధరోష్ఠ బింబమున కాంతి నధిష్ఠితమైనయట్లు నా
మన మతిరక్తమై యెసఁగు మన్మథసాయకదూయమానమై.

**ప్రథమాంకము సమాప్తము.**

---

# శ్రీ కౌముదీమహోత్సవము



## ద్వితీయాంకము

[అంతట మధుమంజరిక ప్రవేశించును]

మధు—అహో! ఇప్పుడు కుసుమశర శిబిర సన్నివేశ సదృశమైన మధుమాసము సమీపించినది. అశోక వృక్షముల కొమ్మల కొనలందుఁ దుమ్మెదలతోఁ గూడి పూల మొత్తములు పూవింటివాని చిచ్చుతో సమానములై కానవచ్చుచున్నవి. అయ్యో! పాపము. మదన శరదారితచిత్తమైన భర్తృదారిక కీ మధుమాసము ప్రతికూల దర్శనమై యుండును.

భామినిక—[ప్రవేశించి] తపో వనవాస క్లేశముచే వాడిన శరీరముగల భర్తృదారిక యొక్క రాత్రి వృత్తాంత మెట్టిదో యసన్నిహితురాలనైన నాకుఁ దెలిసినదికాదు.

మధు—అదిగో భామినిక. నిన్న రాత్రి పురోహితులతోఁ గూడ దేవోపహారమును నిర్వర్తించి చండికాయతనము నుండి తిరిగి వచ్చినది. ఈమెయు రహస్యమును రక్షించు సఖులలో నొక్కతెయని నిపుణిక భావించుచున్నది. కావున నీమెకుఁగూడ భర్తృదారిక వృత్తాంతమును దెల్పెదను.

(సమీపించి)

సఖి! కుశలమా నీకు?

భామి—చెలీ! భర్తృదారికయొక్క అనిర్ణీత నిదానమైన యామయమునుగూర్చి చింతించు మాకుఁ గుశలమేర్పడిది?

మధు—అట్టైనచోఁ గలఁత మానుము. ఆమె యామయము నిదానము నిర్ణయింపఁ బడినది.

భామి—భగవతి వింధ్యవాసిని మన యదృష్టవశమునఁ బ్రసన్నయైనది. ఈసహకారపాదపము నీడనుగూర్చుండి సల్లాపము చేయుదము రమ్ము.

మధు—అట్లే (ఇద్దఱును గూర్చుందురు.)

భామి—చెప్పుము చెప్పుము.

మధు—వినుము. భర్తృదారిక పరిజనుల నందఱను వారించి, నిపుణికామాత్రి సహాయయై కొంచె ముత్కంఠితయైన దానివలె సెజ్జఁజేరినది.

భామి—అటుపిమ్మట.

మధు—పిమ్మట నిపుణిక మఱియొక సెజ్జఁజేరి శయనించి నంతనే నిద్రోదయ ముత్కంఠితయునైన భర్తృదారిక నిదురరాక వెన్నెలవలెఁ బలుచనైన తన చీరచెంగున దగ్గఱనేయున్న రంగులతో, నపరమన్మథుఁడని చెప్పఁదగిన యొక కుమారుని చిత్రము లిఖించినది. అప్పుడు మేల్కాంచిన నిపుణిక శిరమునఁ దమ్మిమొగ్గవంటి యంజలి పుటమును బంధించి, "ఓ హృదయవల్లభా! దయారహితుఁడవైతివికదా! యని పల్కుచున్న భర్తృదారికం గాంచెను. తరువాత నీ వృత్తాంతమును నిపుణిక మాకుఁ జెప్పినది.

భామి—అదిగో తెల్లవాఱినది. మన కీ విషయము ప్రాణ

సమానమైనది. ఈ కుమారుఁ డెవ్వరై యుండును? ఎందుకీ సందేహము? ఈతఁడు మాచేఁ జండికాయతనమునఁ జూడఁ బడిన యా కుమారుఁడే యేమో ?

మధు—కుముదినికి రాకాచంద్రుఁడు తక్క మఱి యెవ్వఁడు హృదయ వల్లభుఁ డగును?

భామి—అగుఁగాక, రమ్మ. అభ్యంతర గృహమున కేగుదము.

(నిష్క్రమింతురు.)

## ప్రవేశకము.

[అంతట విదూషకుఁడు ప్రవేశించును.]

విదూ—ప్రియ వయస్యుని యదేశ కాలోత్పన్న మైన యున్మాద వ్యాధి కుపచారము చేయుచు మిక్కిలి నిర్విణ్ణుఁడ నైతిని. పూర్వము హుత శేషములచేతను భిక్షాహారముల చేతను సంవర్ధిత శరీరుఁడ నైన నేనిప్పుడు పరుల చూపులకుఁ దేలికనై కడంగరీయస బ్రహ్మచారియుఁ గక్ష్యాంతర ప్రవే శానర్హుఁడు నగు నకాల ప్రాప్తప్రాఘుణికునివలె వర్జితుఁడను శపితవ్యుఁడనునై యటునిటు తిరుగు చున్నాను. అగుఁగాక. ఈ లతామంటపముయొక్క వెలుపలినీడ యందు క్షణకాలము విశ్రమించెదను. (అట్లుచేయును.)

[అంతట నిపుణిక ప్రవేశించును.]

నిపుణిక—రాత్రి యంతయు మేల్కొని యుండుటచేఁ గ్లాంత శరీరయైన భర్తృదారిక గర్భిత కుముదినివలె దివానిద్రను బొందినది. అందుచే నా వాసగతురాలైన భగవతి యోగ సిద్ధిని దర్శించెదను. ఆమెయే మాకీ సంకట ప్రవాహమును దాటుటకు సేతువు కాఁగలదు. (పరిక్రమించును)

[అంతటఁ బరివ్రాజిక ప్రవేశించును.]

పరి—విద్యు దిందధ్రగోప విలసన క్షణికమ్ము
భవసుఖాళిరోయఁ దివురుచున్న
నీశుపుత్రి సుగుణ పాశబంధిత నౌటఁ
దాల్తు బద్ధమైన తనువు మరల.

స్వజన వృత్తాంత మావిధముగా దుర్లభమై పోవుటచే నిర్వేద ప్రవ్రజితనై యొక్క దేశమునుండి యింకొక దేశమునకుఁ దిరుగుచుఁ జివరికి శూరసేన మధురం జేరి యచ్చటఁ గీర్తి షేణమహిషియైన రాజన్వతికిఁ బ్రాణసఖినై నివసించు చున్నాను. మదుత్సంగ సంవర్ధితయైన యామె కూఁతునం దపత్యస్నేహము కలదాననై తపోవనాభిముఖురాలైన యామె ననుగమించి వచ్చితిని. ఆమె యనురక్తుఁడైనపతిని వరించి తద్గృహమును జేరువఱకు నాకు నిస్సంగత్వమెక్కడిది. ఏలయన?

మాధవీలత మున్నాశ్రమపు రసాల
భూరుహము నాశ్రయమ్మను బొందెనేని
తమకెదో యవ్యయానంద మమరినట్లు
తెలమిఁ గాంతురుకాదె మునీంద్రులెల్ల.

కాని యీమధ్య నామె కొంచె మస్వస్థాకృతిగాఁ గాన వచ్చుచున్నది. లోకముకూడ నీవిధముగాఁ జెప్పుచున్నది.

"ఎట నైష్ఠికుఁడును వల్కల
వటధారియునైన మునియు వ్యథనొందెడు న

య్యటవీ వాసము నీయమ
మెటు లటు జనకాంక సుఖ సమేధిత యోర్చెన్.

మఱియు;

జాతిపడెం గృశించిన భుజంబుల బాహుపురుల్ కడెంబులున్;
దోరపు టూర్పు గాలుల హతుల్గడు వాడిచె మోవి కెంపు; సం
స్కారము లేక పెన్నెరులు కాంతి తొఱంగె; ధరావరాత్మజా
శ్రీరుచిరాంగ మెంతయును జెన్నఱి తెల్పురుచి న్వహించెదున్.

అని; నాకు మాత్రి మీ సందేహము కలుగుచున్నది. ఆమెకు

సవిలాస దృక్పాత శబలమైనకపోల
తలములఁ గడు వెల్లదనము కదిరె;
నన్యోన్య సంబాధ మందు గుబ్బలదోయి
యావనారంభోష్మ మావరించె;
ననవధానంబైన యంతరంగంబున
నధిక చింతాజ్వరం బావహిల్లె;
సహజాంగ కాంత్యుపచయముచేఁ గృశతయ
వ్యక్తమయ్యును గానఁబడుచునుండెఁ;
బ్రిచ్యుత సువర్ణభూషణ ప్రితతులైన
భాగముల విషమంబులై పరగు రాజ
కన్య సుకుమార నిఖిలాంగకములయందుఁ
బచ్చవిల్తుని యామయం బెచ్చుమీఱె.

శ్యేన పాద పరిభ్రిష్టమై యాకసమునుండి పడుచున్న యీచిత్రిపట మెవ్వరిదో కదా!

బర్హి బర్హమ్ము వలెఁ జిత్ర వర్ణమైన
వారిదాధ్వ పతచ్చిత్ర పటముఁ గాంచి
వారిద విస్పష్టమును నపూర్వమును నైన
వేల్పురావింటి తునుక భావింతు మదిని.

అగుఁగాక భూమిమీఁదఁ బడకుండనే దీనిని బట్టు కొనెదను. (గ్రహించి శిలాతలమునఁ గూర్చుండి పరిశీలించును.)

నిపుణిక—భగవతి యొక్క లతా మండప మిదియే. (ప్రవేశించి, చూచి) ఇదిగో భగవతి యొక చిత్రపటమును జూచుచు శిలాతలమునఁ గూర్చున్నది. అహో! బహుళములైన యాశా బంధములతోఁ జెలికత్తె లేకాంత స్థలమునఁ గూర్చుండి యుండ నామిషఖండ భ్రాంతిచే శ్యేన మీ చిత్రపటమును దన్నుకొని పోయి యుండును.

పరి—ఆకారబద్ధమైన యీ తేజము మహత్తరమైనది.
వాసోంతరచిత మీయన
ఘూశయు చిత్రమ్ము చూడ్కి నచ్ఛముకుర సం
భాసితమై మొగమునఁబడు
పూషుని ప్రతిబింబమట్లు పోరి నరికట్టున్.

(తిరిగి సావధానముగాఁ జూచి) అయ్యో! మహాదేవీ! (అని మూర్ఛనొందును.)

నిపు—అయ్యో! అయ్యో! భగవతి చిత్రపటమును జూచుచున్నదై, హా! మహాదేవీ! యని పల్కి మూర్ఛనందినది. గొప్ప యుత్పాత మేదియో సంభవింపఁ గలదు. (వెంటనే

సమీపించి యామెను దొడపై నిడుకొని) ఊఱడిల్లు; మూఱడిల్లుము.

పరి—(కొంచె మూఱడిల్లి) హా! మహాదేవీ! అప్పుడు పతిలోకమునకుఁ బ్రస్థితురాలవైన నీవు నాచేతనిడ, శత్రుభీతిచేఁ జలించుచున్న కాక పక్షములతోఁ గల్యాణవర్మయమాత్య కుమారులతోఁగూడా......(మరల మూర్ఛనందును)

విదూ—ఏమిది! లతాగృహాభ్యంతరమున శబ్దమువలె వినిపించుచున్నది. అగుఁగాక; కొమ్మలమధ్యనుండి చూచెదను. (అటులుచేసి) ప్రియవయస్యుని ప్రతికృతిని జూచుచునెవ్వరో యొక పరివ్రాజిక మూర్ఛం బొందినది. ఆమెనొక స్త్రీ తొడపై నుంచుకొని యూఱడించు చున్నది. వినయంధర యనుపేర నిర్వేద ప్రవ్రజితయైన యామెయే యీమె యని తలంచెదను.

నిపు—ఊఱడిల్లు; మూఱడిల్లుము.

పరి—(ఊఱడిల్లి) ఆతఁ డక్షత శరీరుఁడై యుండుచో నీపాటికింత వాఁడుగా వర్ధిల్లి యుండును.

నిపు—(తనలో) ఏమి భర్తృదారికకు హృదయ వల్లభుఁడైన యా జనుఁడు భగవతికి స్వజనుఁడే యుండునా? (ప్రకాశముగా) భగవతి! సంసారి జనోచితమైన యీయాయాస మేమి? విజ్ఞాన విశేషమున కనుచితమై దుఃఖాక్రాంతమైన యీ వాక్యమేమి?

పరి—(విమర్శించి) ఓ నిపుణికా! ఓసి నిపుణికా!

నిపు—(తనలో) మూర్ఛనుండి తేఱిన యీమెకు సర్వమును

విన్నవించెదను. (ప్రకాశముగా) కుమార కల్యాణవర్మ యిప్పు డెచ్చట నున్నాఁడు?

పరి—

ఎవ్వనిరోయుఁ గన్నుఁగవ యెల్లెడ నశ్రులఁ దోఁగియుండియుర్
ఎవ్వఁడు ప్రిస్నుత స్తనము నిప్డును వేచు మదీయ వక్షముర్
ఎవ్వనిఁగోర్కె కుడ్యమున నేను లిఖింతుఁ దలంపుకుంచెనా
మవ్వపుబిడ్డ ప్రిచ్యుతుఁడు మాయవిధాతృనె పృచ్ఛచేయుమా!

(మరలఁ జిత్రపటమును వీక్షించి)

ఎవికౌమార విభిన్న ముష్టితల సంధృశ్యాతపత్రాంకముల్
ఎవి భూచంక్రమవేళఁ బట్టుకొను సంతృప్తిర్ మదగ్రాంగుళిర్
ఎవి వంద్యార్యనమస్క్రియార్థమయి మాతృపేరణంగూడు న
య్యవి భోగీంద్రఫణాప్రమాణములు హస్తాబ్జమ్ము లెట్లున్నవో!

(కన్నీరు విడుచును)

నిపు—(పత్రపుటమున నీరు గ్రహించి) భగవతి! ముఖోదక మిదిగో!

పరి—బుద్ధి యించుక ఋణవిము క్తమైనది. (ఈషదివ ప్రాప్తా నృణ్యా బుద్ధిః)

నిపు—భగవతి! ఇట్టి యాకారము కలవాఁడే కుమారుఁ డొకఁడు భర్తృ దారికచేఁ జూడఁ బడెను. ఇది యామెచేఁ జిత్రింపఁ బడిన యాతని ప్రతికృతి. ఈచిత్రపట మామిష ఖండలుబ్ధమైన శ్యేనముచే సఖీజన హస్తములనుండి యాక్షిప్తమై గగనమునుండి మరల భగవతీ హస్తమునఁ బడినది.

పరి—ఏమియేమి? చెప్పుము. ఈచిత్రపటమునురచించినయామె కుమారు నేవిధముగాఁ జూడఁ గల్గినదో చెప్పుము.

నిపు—ఇట్లు.

పరి—ఆమెచేఁ జిత్రింపఁ బడిన యీతఁడు మగధ రాజకులాంకురమైన మఱొకఁడా?

నిపు—భగవతికి భర్తృదారకుఁ డీతఁడు మఱి యొకఁడా?

పరి—నిపుణికా! నీకు భూతార్థమును జెప్పెదను వినుము. మున్ను సుందరవర్మ యనెడి మగధాధినాథుఁ డుండెను. ఆతని యగ్రమహిషి పేరు మదిరావతి. ఆమెకు దాదియు, నెచ్చెలియుఁ గుమార ధాత్రియునై యుండి నేను దైవ వశమున నా రాజకుల మంతర్హితముకాఁగా నిర్వేద ప్రవ్రజితనై మధురంజేరి నివసించు చున్నాను. ఇప్పుడు కీర్తి మతియే నా సర్వస్వమును.

విదూ—హీం! హీం! నేనిప్పుడు స్నాతకుఁడనై తిని, వైఖానసుఁడు దుర్మేధుఁడని మంత్రిగుప్తుఁడు వచించుచుండును.

పరి—(తనలో) ఇప్పుడు సమయము వచ్చినది కావున నీమె నడిగెదను. కీర్తిమతినిగూర్చి నిపుణిక కంతయుఁ దెలియు నందురు.

(నేపథ్యమున)

సుఖసముత్థితు శీతాంశుఁ జూడ—వినఁగ
నైన నోపదు భూమిపు నాత్మజాత
చివురుటాకుల గముల రచింపఁ బడిన
సెజ్జమెయి చేర్పనోపకు క్షితిపతి సుత.

పరి—అహో! ఈవై తాళికులచే వైతాళికీయము లెన్నగాఁ

బాడఁబడినది. నిపుణికా! కీర్తిమతి నుద్దేశించి నిన్నింతయ యడుగఁ గోరుచున్నాను.

నిపు—భగవతి యాజ్ఞాపించుఁగాక!

విదూ—ఈచెలికత్తె రాజదారిక విశ్వాసమునకుఁ బాత్రమైన దని తలంచెదను.

పరి—నిపుణికా!

నరపతి కూర్మి బిడ్డవదనం బదియేల మహాత్మముత్థితం
బరతి సమాశ్రయించిన నయంబునఁ దోఁచుచు నెల్లవేళలం
దొరఁగెడి బాష్పబిందువుల దూషితమైన కపోలరేఖతో
నరయఁబడుఁ హిమాంబు కణికాన్విత నేజముఁబోలెఁ జెప్పుమా!

నిపు—భగవతి యీ విషయమును భర్తృదారికచే లిఖింపఁ బడిన చిత్రమునందలి కుమారు నడుగవలయును. ఆమె యిప్పుడు నిట్టూర్పుగాలులచేఁ గలఁచఁ బడినదై బాలకదళీ పాదపమువలె నిటునటుఁ దూలిపోవుచుఁ బ్రియసఖులను గూడఁ బరిహరించుచున్నది. భగవతి యొక్క కంటితోఁ జూడనిచో నాదీనురాలు శోకపర్వత శిఖరమున నారోహింపఁ గలదు.

పరి:—

కాంతుఁడు చెంత లేకునికిఁ గన్నులు నిద్దురరాక యెట్లనె
య్యాంతర తాపముం దెలుప నాక్షితిపాత్మజ నాథురాకకై
చెంతల దవ్వులం గనుచుఁ జేడ్పడి రాతిరి పుచ్చుఁ బద్మినీ
కాంతుని రాకకై యెదురు కాంచెడి జక్కవచాన కైవడిన్

విదూ—హా! హా! భిక్షుకై యేగిన నాకు నిమంత్రణముపై

నిమంత్రణము లభించినది. (సమీక్షించి) వైఖానసుఁడు నమస్కరించుచున్నాఁడు.

పరి—అహో! వైఖానసుఁడు వచ్చినాఁడు. ఈ "మేఘము లేని వాన" యెక్కడిది?

నిపు—(తనలో) ఆకారముచే వానరమును, మాటచే గర్దభమును బోలు నీతఁడెవ్వఁడు?

విదూ—ఇది కల్యాణ వర్మయొక్క నమస్కారము. (అంజలి బంధించును)

నిపు—(తనలో) ఆ కు మా రు ని కీతఁడు వ య స్యుఁ డు కాఁబోలును.

పరి—

ఆనతరాజ దారల కరాగ్రవిసర్పిత దర్పణంబు; కాం
తానిచయేక్ష్యమాణ భవనస్థిత నూతన చంద్రముండు; పా
లానఁగఁజేయు మాతృ నివహంబుల పాలిటికందుఁడో యి,వై
ఖానస! చెప్పు పుష్పపురి కన్నులవిం దతఁడేడ కేగెనో?

విదూ—అచిరకాలమున నే భగవతికిఁ బుత్త్రిదర్శనము కాఁగలదు. రాజపుత్త్రిక ప్రియ వయస్యునికై సంతాపము నొందుచున్నది వయస్యుఁడును రాజదారికా దర్శనముచే మదన వేదనకు గుఱియై బహుళపక్ష క్షపాకరుని మాడ్కిఁ గృశించిన శరీరముతోఁ గానఁబడు చున్నాఁడు.

పరి—సాధు! సాధు!

కుముద దళ దీర్ఘదృష్టి పాతమును రాజ
కన్యకామయమ్మను నెన కాముని వలఁ

దగులుకొని రుద్ధ మార్గుఁడై నొగులు పడెడిఁ
దరుణ సింహోపముఁడు నరవరసుతుండు.

నిపు—నా హృదయము తెప్పిరిల్లి నట్లైనది. ఇదియంతయు సత్యమే యగునా?

పరి—ఈ విషయమంతయు మాకవిదితముగానున్నది. అతర్కితమైన యీ ప్రియజన సమాగమమెట్లు సమకూడినది?

విదూ—ఇట్లు.

పరి—సరే! నేను జీవించియుండుట ప్రయోజన వంతమువలె నున్నది.

విదూ—ఓసి! రాజదారిక ప్రియవయస్యుని ప్రతికృతిని జితించినది. నీవు నా ప్రతికృతిని జితింపుము.

పరి—(చిఱునవ్వుతో) ప్రశస్తమైన కోరిక!

నిపు—ఛీ! వాచాలా! దుష్టవటుకా!

విదూ—ఓసీ! కోపగించకుము. ఇదిగో మిమ్ములను సాంత్వన పఱిచెదను. (ఉత్తరీయమునుండితీసి హారము నర్పించును.)

నిపు—హా! భర్తృదారిక కోల్పోయిన యీ "హార" మిదియే. (హార మంజలితో గ్రహించును.)

పరి—(తనలో) మదుత్సంగ వర్ధితులైన యీ కీర్తిమతీ కల్యాణ వర్మ లిరువురును బరస్పరము కామాతురులై యున్నారు. అందుచే వాగర్థములకువలె వీరిరువురికిని సమాగమము చేకూర్చెదను. (ప్రకాశముగా) నా యభిప్రాయమిది. (ధాతురాగముచేఁ బటాంతమున వ్రాసి చదువును.)

మహిత శౌనకునకు బుద్ధిమతి విధాన
రమ్యుఁ డవిమారకునకుఁ గురంగివోలె

మూర్త సద్గుణ పుంజ మీా కీర్తిమతియు
ననఘ కళ్యాణ వర్మాభిధునకుఁ దగును.

గూఢరక్షితమైన దీనిని బ్రాతఃకాలమునఁ గుమారునికి సమర్పించి మరల నాకుఁ గనిపింతువుగాక! (చిత్రపటము నర్పించును.

విదూ— భగవతి యాజ్ఞాపించినట్లే. (చిత్రపటమును గ్రహించి నిష్క్రాంతుఁడగును.

నిపు—భగవతీ! భర్తృదారిక ప్రాణములను రక్షించుట యెట్లు?

పరివ్రాజిక—నీవా విషయమున విచారింపకుము. చూడుము.

అనితర వేద్యమై తగు రహస్యపుఁ దంత్రముఁ జేసి ప్రాణనా
థుని సమకూర్చి రాజసుత తోరపువంత తొలంచివేయుదుర్
ఘన నినదంబులు న్నలద కాండము లేకయ మింటనుండి ధా
త్రినిబడు మంచివర్షమట రేగు నవగ్రహ శోషముం బలెన్.

[అందఱు నిష్క్రమింతురు.]

ద్వితీయాంకము సమాప్తము.

---

# శ్రీ కౌముదీమహోత్సవము



## తృతీయాంకము

కుమా—

మనసుచేనైనఁ బొందఁగా ననువులేక
యవిదితాంతర భావయౌ నతివఁగూర్చి
మదనుఁ డాకస్మికమ్ముగ మచ్చరించి
నాపయిని నేమిఫలిత మందన్ గలండో?

(మదనావస్థను నిరూపించి) అహో! యౌవన మధ్యందిన ప్రకటితములగు మిథ్యామనోరథ మృగతృష్ణికలచే విషమములైన విషయ మరుదేశము లందుఁ బరిభ్రమించు కామిజన పథిక సార్థమును బంచబాణ పతంగుఁడు మిక్కిలి తపింపఁ జేయును గదా! ఏలయన ?

అనలాక్షుని కోపానల
కనదర్చులఁ గబళమైన కారణమున నీ
మనసిజుఁడు నిశ్చయమ్ముగఁ
గొనియుండును దీవ్రదాహ గుణమని యెంతున్.

నీ! మన్మథుఁడు పరాశ్రయముచేఁ దన్నుబలవత్తరునిగా భావించుకొను చున్నాఁడు.

విలసదశోకచూతసుమ పేశలసౌరభ గర్భవాయువుల్
కలబిన కంఠకాశత ముఖంబగు ప్రావృష మంధకారము

న్నలయ తల ప్రసంగి నవ నీరజ శుభ్ర శరత్ప్రదోషముం
గలుగవయే ననంగుఁ డతి కాతరుఁడేమి యొనర్పఁజాలెడిన్.

ఆ సారస లోచన మరల నాకుఁ గానిపించునా? ఛీ! జీవలోకమంతయు స్వకార్యపరాయణముగదా! ఏలయన?

కాంతరూపామృతమున భాగం బొసంగి
యుపకరించిన నేత్రమ్ము లిపుడు తనకు
స్మరణసుఖ మబ్బ దాని క్షేమాత్రి మిడక
వంచనము చేయు నాదు నల్పంపుఁ బెడఁద.

నాకు జీవిత సర్వస్వభూతయైన యామె ముక్తికహార మెక్కడనున్నదో? అవును. ఆ రాజదుహిత సఖజనముకాని పరిజనముకాని యెచ్చటనైనఁ గానిపించునేమో యనెడి యాశచే బ్రియవయస్యుఁడు వైఖానసుఁ డరిగినాఁడు. ఆ హార మాతని చేతనున్నది. అవసన్న మగుచున్న నా యాత్మకు దేని నవలంబనముగాఁ జేసికొందును? అగుఁగాక; ప్రియా దర్శన ముహూర్త భాజనీ భూతమైన యాజీర్ణోద్యానమున కే యరిగి పర్యుత్సుకమైన యాత్మను వినోద పఱుచుకొందును.

[అంత విదూషకుఁడు ప్రవేశించును.]

విదూ—[పరిక్రమించి, చూచి] ఇదుగో ప్రియవయస్యుఁడు శాపమోచిత విజ్ఞానుఁడై ధరణిపైఁ బడిన విద్యాధర కుమారునివలె శోచనీయ మయ్యును దర్శనీయమైన యాకారముతోఁ గానఁబడుచున్నాఁడు. (సమీపించి) వయస్యునికి జయమగుఁగాక. అయ్యో! ప్రతివచనమే లేదు. అధికమైన చింతచేఁ గన్నులు మూసి చిత్రగతుని వలెఁ

దో(చుచున్నా(డు. ఈవిధముగా( బలికెదను. రాజ
కుమారా! రాజ్యలక్ష్మినిగూర్చి చింతిచు చుంటివా యేమి?

కుమా—[కన్నులు తెఱచి చూచి] అహో! ప్రియవయస్యుఁడు వైఖానసుఁడు; వయస్యా! అగు నట్లే, కాని

నవమణిభాసి మూర్ధము కనద్ఘన తేజము భోగిపాళితో
నెవతె ప్రిచేతునందు జనియించినదో యలవాహినీశు నం
దెవరి తె పూరుషోత్తమునికే ప్రియమై కనదన్యు, నట్టి భూ
ధవరమ వోలె నాదునెడద న్నృపునాత్మజ మృగ్యమాణమౌ.

మిత్రమా ! ఈ వసంత ప్రాతరారంభములు సావశేష తుషారములగుటచే శైలేయగంధియైన ఈ శిలాతలమున నించుకసేపు కూర్చుండుదము రమ్ము.

విదూ—ప్రియవయస్యుఁ డాజ్ఞాపించినట్లే. (ఇరువురును గూర్చుందురు.)

కుమా—ప్రియా పయోధర సంసర్గముచే శ్లాఘనీయమైన యా ముత్యాలహారము నిటు తెమ్ము.

విదూ—అయ్యో! ఆ హారమెచ్చటనో జాఱిపోయినది.

కుమా—ఛీ! మూర్ఖా!

విదూ—హీ ! హీ! వైఖానసుఁడు మూర్ఖుఁడే యగుఁగాక వైఖానసుఁ డపండితుఁడుగదా ! ముందు నావచనమును విని పిమ్మట నన్ను నిందింపుము. ఇచ్చటినుండి వెడలిన నేను రాజదారికకుఁ బ్రాణనిర్విశేషమైయ యామె ముత్యాల హారము నన్వేషించుచుండెడి నిపుణికచేఁ జూడఁబడితిని.

కుమా—(కుతూహలముతో) ఏమి ! నిపుణికచేఁ జూడఁ బడితివా? తరువాత, తరువాత,

విదూ——ఇంకఁ దరువాత నేమున్నది. రూపాభిగృహీతుఁడైన చోరునికిఁ గల్గు దుస్థితియే నాకును గల్గినది.

కుమా——పరిహాసమును విడిచి విస్పష్టముగాఁ జెప్పుము.

విదూ——ఇట్లు (చిత్రపటమును జూపి) చూడుము. చూడుము. ఇదిగో నీచిత్రమును బూజ్యురాలైన రాజకుమారి చిత్రమును జూడుము.

కుమా——ఇది సత్యమేనా? ఇట్టి యతర్కితమైన యభ్యుదయ విశేషము నెవ్వఁడు విశ్వసింపఁ జాలెడిని? నాహృదయము మిక్కిలిగా నానందించు చున్నది.

ప్రణయిని గాఢమైన యనురక్తికి భాజనమాట నుల్లస
త్తనురుహ రాజిచేఁ గవచితంబగు దేహము దాల్తునిప్డు, మో
హానమగు చెందిరంపుఁ బొడియంతటఁ గ్రొలఁగ దర్శనీయమై
తనరెడు మస్తకమ్ము శుభదమ్మగు హారతి రాడ్గజమ్మటుల్.

మఱియు

మును వామమ్ము వసంతవాయు విపుడొప్పం బూర్ణదాక్షిణ్యమై
మునువజ్రమ్ములు చిత్తజన్మఁ బువుటమ్ముల్ నేఁడు సార్థమ్ములౌ
మును రేలం బెనునిప్పుకల్ చెలఁగు సంభోజారిరోచుల్ సుధా
కణనిష్యందను లౌచుఁ జిత్తమునకుంగల్పించు నానందమున్.

(సావధానముగఁ జిత్రపటమును బరిశీలించును)

విదూ——వయస్యా! నీవేమి పరిశీలించు చుంటివి? పూజ్యురాలైన యారాజపుత్రి శిల్ప విజ్ఞానమునా, లేక నీయాకృతి రామణీయకమునా?

కుమా——ప్రియురాలి యీచిత్రకర్మ యామె శిల్పవిజ్ఞానముతో

పాటామెకు నాయెడఁ గల యనురాగాతిశయమును గూడ వెల్లడి చేయుచున్నది.

ఆత్మ ననురాగ మగ్గల మగుచునున్నఁ
జెలులెదుట వెల్లడింపదు చెలువ లజ్జ
నిపుడు నాచిత్రమిట లిఖియించి లోని
భావములనెల్ల నోటఁ జెప్పకయ చెప్పె.

విదూ—వయస్యా! మీయుభయులలో నెవ్వరిశిల్ప విజ్ఞానము సవిశేషమా యని నాకు గొప్ప సందేహము కలుగుచున్నది. అందుచే నీ వింధ్యశిలోచ్చయ సన్నిహితములైన ధాతు రాగవర్ణకములచే నా పూజ్యురాలి ప్రతికృతిని లిఖింపుము.

కుమా—మిత్రమా! నాకును నిట్టిదే యభిప్రాయము గలదు. కాని

భావజ వికారవతిఁ బ్రియఁ బటమునందు
వ్రాయుదున యేని సర్వ్రతిఁ బడయవచ్చుఁ;
గాని వలవంతఁ గార్శ్యమ్ముఁ గనవయామె
యొడలి గ్లపితమ్ముగా వ్రాయ నుత్సహింప.

విదూ—(చిత్రపటమును దెచ్చును.)

కుమా — (చూచి; "మహితశౌనకునకు," నన్న పద్యము చదివి) ఈ యక్షరపంక్తి యెవ్వరిది ?

విదూ—భగవతి యోగసిద్ధిది.

కుమా—అహో! భగవతి నా యెడల నిష్కారణ వత్సలయై యున్నది.

విదూ—(తనలో) ఇప్పుడు యోగసిద్ధిని గూర్చి యథార్థము

నెఱింగించెదను. (ప్రకాశముగా) ఆమె నిష్కారణ వత్సల కాదు.

కుమా—ఏల ?

విదూ—ఇట్లు.

కుమా—ఏమి ! ఆమె నిర్వేద ప్రవ్రజితయైన నా దాదియేనా?

మరణించిన జననీమణి
పరలోకమునుండి తిరిగి పరతెంచినటుల్
కరమరుదగు—నీ కన్నులఁ
బరికింపంగలనె మరల వరజనయిత్రిన్॥.

(కన్నీరు విడుచును.)

విదూ—మిత్రమా ! ఊఱడిల్లు మూఱడిల్లుము. జన్మాంతర భూతమైన యీ కాలము కడచిపోయినది.

కుమా—అందుచేతనే హృదయ మించుక యూఱడిల్లుచున్నది.

విదూ—(మరలఁ జిత్రపటమును విప్పి) చిత్రింపుము.

కుమా—(కీర్తిమతి ప్రతికృతిని లిఖించును.)

నందకుఁడు— (ప్రవేశించి) దేవరకు జయమగుఁగాక. స్నాన వేళ సంప్రాప్తించినది.

విదూ—అక్కటా ! నా మేనినుండి వెడలిపోయిన యీఁకలి మంటలతోఁ గూడ మధ్యాహ్నము సమీపించినది. (లేచి) ప్రియవయస్యుఁడు కూడ లేచునుఁగాక.

కుమా—(విదూషకునిచేతఁ జిత్రపటమునిడి పరిక్రమించి) అహో! దండరుచియైన భూమండలనేతవలెఁ జండకిరణుఁడు కరము ప్రజ్వరిల్లుచున్నాఁడు. ఏలయన?

కరగళదంబు శీకరనికాయముచేఁ గరితాఁకు వాశికన్;
మఱియొక వేష్టన మ్మిడ శ్రమంపడుఁ జందన భూజమూలమం
దురగవిభుండు ధ్యానవసుధోపవిశ న్ముని యూరు శయ్యపై
నొరగెడిఁ గున్కుచుం బరిచయోత్కము బాలమృగమ్ము నిద్రకై.

(అందఱు నిష్క్రమింతురు.)

తృతీయాంకము సమాప్తము.

---

# శ్రీకౌముదీ మహోత్సవము

## చతుర్థాంకము

[అంతటఁ గౌంభకూణవిక వేషుఁడైన వర్ధమానకుఁడు ప్రవేశించును]

వర్ధ—కుంభకూణవమును మోగ్రియించి పాడును.

రాముశరముల బలము కర మ్మలుపము
గుహునికథ యంతరించెడిఁ గొంచగుట్ట
వ్రిక్కలించుటతో గజవదన నీదు
రదనములతోడ నేవియు రావుసాటి.

(తిరిగి పాడును)

రేవతి ముఖమద మానుట
నావహిలిన యుదయరాగ మదితాలిచి నీ
లావిల వసన కళంకుం
డావిధువట్టులు ప్రిలంబ హారుఁడు వెలుంగున్.

(పరిక్రమించి) ఆర్యమంత్రిగుప్తుఁ డీవిధముగా నాజ్ఞాపించినాఁడు. "సౌమ్య! శూలపాణి సిద్ధాయతనమున కరిగి యటఁ బాశుపత వేషముతోనుండు నార్యరక్షితుని నాకడ కొకసారి రమ్మని చెప్పుము" అని (పరిక్రమించి చూచి) ఇదిగో! శూలపాణి సిద్ధాయతనము. ఇచ్చట నుపధావిశుద్ధులును, గృహీత ప్రిచ్ఛన్న వేషులును నగు సుభట వరేణ్యులు పెక్కురు కానిపించుచున్నారు.

(నేపథ్యమున)

శశిఖండ శేఖరుఁడవైన యో శంకరా! నీకు నమస్కారము.

వర్ధ—(చెవియొగ్గి) ఇది భగవంతుఁడైన శంకరుని పాదపద్మముల కభివందన మొనర్చుచున్న యార్యుని కంఠస్వరము వలె వినవచ్చుచున్నది. అగుఁగాక! సంకేత లక్షణముకల యీ చందనవృక్షమునీడ నాతనికొఱకు వేచియుండెదను.

[అంతటఁ బాశుపతవేషుఁడైన యార్యరక్షితుఁడు ప్రవేశించును.]

ఆర్య—శశిఖండ శేఖరుండవైన యో శంకరా! నీకు నమస్కారము.

ఉరగపుఁబేరు వక్షమున, నుగ్రవిషంబు గళంబునందుఁ, గై
సరసిజ భూకపాలము, భుజంబున నేనికతోలు, నౌఁదలన్
వరుణ నికేతనంబయిన వార్నిధిసారము, లాటిఫాల భా
గరుచిరమైన శీతకరు ఖండముఁదాల్చెడి నీ కివే నతుల్.

మఱియుఁ బుట్టినదాది ననపాయినియైన నాప్రార్థనయిదే.

ఆవిల కామసంగ కలుషాల్పమనస్కుల మాట, దివ్యమా
త్రావక సుస్వరూపము విధంబు కనుంగొనలేని మాకు, భ
క్తావన బద్ధకంకణ! భవాంతరమందును బుట్టుదొట్టి నీ
పావన పాదపద్మముల పైఁగడుభక్తి యొసంగఁ జేయుమా!

(సప్రదక్షిణముగా నమస్కారము చేసి, పరిక్రమించి)

ఈప్రాకారమునకు నుత్తరముననున్న చందన పాదపచ్ఛాయయం దించుకసేపు విశ్రమించెదను. అచ్చటఁ గార్యవంతులైన మంత్రిగుప్తుని కింకరులు నాకొఱకుఁ బ్రతీక్షించుచుందురు. (అటులు చేయును)

వర్ధ—ఆర్యా! నమస్కారము.

ఆర్య—ఓహో! వర్ధమానకుఁడా! వర్ధమానిక! కుంజరకాను వర్ముఁలైన ప్రత్యంతపాలకులు కుపితులుకాఁగాఁ బ్రత్యతి చికీర్షచే ససైన్యముగాఁ జండసేనహతకుఁడు నగరమునుండి బయల్వెడలెననియు, నిప్పుడు స్వామి ప్రత్యానయనార్థమై మంత్రిగుప్తుఁ డాత్మీయుఁడైన దూతయైన హారిణాశ్వునిఁ బంపె ననియు నీవెఱుంగుదువా?

వర్ధ—పంపెనని మాత్రమే నాకుఁ దెలియును; కాని యందలి యభిప్రాయమేమో నాకుఁ దెలియదు.

ఆర్య—అహో! సాధు! మంత్రిగుప్త! సాధు! ఉపధా విశుద్ధుఁడైన యీ గర్భదాసుఁడు పారిపార్శ్వకత్వ మయ్యు వికృతియలయందు నీ యభిప్రాయ మేమో తెలియఁజాలకున్నాఁడు. నీ మంత్రమునకు దోషమనఁగా నెట్టిది? ధర్మార్థకామముల యనుశాసనము తుల్యరూపమై వెలుఁగొందుచున్నది. ఏలయన?

కలుగుఁగాక ఫలము కలుగకుండెడుఁగాక
యార్యు లాత్మ ధర్మమని తలంచి
యాగమార్థ మట్టు లపగత స్వార్థులై
యధిపులకు భృత్యు లాచరింతురు.

వర్ధ—ఆర్య! ఇప్పుడు స్వామియరుదెంచుచో రాజ్యలాభము నిశ్చితమౌను గదా!

ఆర్య—ఇందు సందియ మేమున్నది? చూడుము. పూర్వసన్నివిష్టులైన సాగరదత్తాది స్థవిరామాత్యులతోఁ గలసి యార్య మంత్రిగుప్తుఁడు మహారాజ సుందరవర్మను

గూర్చియుఁ, దత్సుకృత పరంపరలను గూర్చియుఁ, పౌర జానపదులకు రహస్యముగా నుద్బోధించియుండెను. స్వామి యిప్పు డరుదెంచుచో వారు శత్రువును రూపులేకుండఁ బరిమార్పఁ గలరు. తరువాత స్వామిపాదములను సేవింతు రనుటలో సందేహ మేమున్నది?

వర్ధ—ప్రకృతులు చండసేన హతకునియెడ విరక్తులగుటకు హేతువేమి?

ఆర్య—అతని శీలమునందలి యపరాధముచేతనే.

ప్రకృతులఁ గారనుంచి పరిపాండుకపోల నిదర్శితవ్యథా
వికృతులఁజేసి కోల్పడియె విశ్రుతమైన తదాదరమ్ము, నా
త్తకుటిలమార్గుఁడై సకల ధారుణి భాగము నాక్రమించి, ధా
ర్మికులగు రాజవర్యుల గమి న్వొగిలించె ననేకభంగులన్.

వర్ధ—తరువాత, తరువాత. ఇట్టివానికి రాజ్యశ్రీ యెట్లు లభించెను ?

ఆర్య—ఈకథ చాల విస్తృతమైనది. ఒక్కమాటలో చెప్పెదను. మున్నీతని స్వభావము నెఱుంగని సుందరవర్మ మహారాజుచే నీ చండసేన హతకుఁడు విషవృక్షము వలెఁ బుత్రీకృతుండయ్యెను.

వర్ధ—తరువాత, తరువాత.

ఆర్య—తరువాత నీతఁడు మగధ కులమును వంచించుటకై మగధకుల వైరులును, మ్లేచ్ఛులును నైన లిచ్ఛవులతో సంబంధము కల్పించుకొని సమయముచూచి, కుసుమపురముపై దండెత్తెను.

వర్ధ—తరువాత ,తరువాత.

ఆర్య—తరువాత ప్రవర్తిల్లిన మహాసంగ్రామమందు వర్ధ పాత్రమయ్యుఁ బెంచిన ప్రేమచే నీతని విడిచి మహారాజు లిచ్ఛవికులమును రూపుమాపియుండెను. పిమ్మట,

అమితపరాక్రమంబున విహారముసల్పి రణాంగణంబునం దమరని కేతనమ్ముగనకు నంపి యనేకవిరోధివీరులన్ సమధికమత్సరుండు, నరిసంఘ భయంకర విగ్రహుండునై సమరతలంబునంద, దివిషత్పురిచేరెను తేఁడు సైతమున్॥.

వర్ధ—అక్కటకటా! ఆదృశుఁడైన మహారాజునకుఁ గూడ నసదృశ సంగ్రామమునందు మృత్యు వుప్పతిల్లెనుగదా!

ఆర్య—ఇటు వినుము. జరయను పేరి వ్యాధునిచే భగవంతుఁడైన పుండరీక నేత్రుఁడును లోకాంతరమును బొందింపఁ బడెను గదా!

వర్ధ—సమయము వచ్చినది కాన నడుగుచున్నాను. స్వామి సహితులైన తమ రందఱికిని దపోవనవాసమేల సమ కూడినది?

ఆర్య—దీనిని గూడ వినుము. అప్పుడు మా పితరులు స్వామితో పాటుగా స్వర్గలోక మధిగమించిరి. మా జనములును మహా దేవులతోఁ గూడ భగవంతుఁడైన యుమర్భుధు నాశ్రయించిరి. మేమును బాలుఁడైన స్వామితోడను, సమాన వయస్కయైన వినయంధరయను పేరుగల దాదితోడను రాత్రివేళ ప్రచ్ఛన్నముగా నరణ్యమునకు బయలుదేరి, యట వనగజ బృంహితత్రస్తులమై చెదరిపోతిమి. తిరిగి యదృచ్ఛాగతులైన తాపసులచేఁ దపోవనమునకుఁ దీసి కొని రాఁబడితిమి. ఇంతవఱకు జరిగిన వృత్తాంత మిదియే.

వర్ధ—ఆర్యమంత్రిగుప్తుఁడు తమ్ముఁ జూడఁగోరు చున్నాఁడు.

ఆర్య—సరే! నీ వరుగుము. నేను నపరాహ్ణమున భిక్షాటన మిషచే నరిగి రథకార వేశ్మగతుఁడైన యార్యునిఁ జూడఁ గలను. (నిష్క్రమింతురు.)

(ఇది మిశ్ర విష్కంభము)

[పిమ్మట సఖుఁడుఁడు సోష్ణీషుఁడునై మంత్రిగుప్తుఁడు ప్రవేశించును]

మంత్రి—అహో! స్వామికార్య పర్యాకుల హృదయుఁడనైన నాకుఁ గాల మవిది తాహోరాత్రమై కడచిపోవుచున్నది. ఇప్పుడు,

సముపనత సాహసావస
రము నీతికలంచు మిగుల రంగోన్ముఖ వా
గ్రిమ మారిష నటులనువలె
నమరిచి సందియము సత్ఫలాధి గమమునన్.

(చూచి) అహో! దివసము ముగిసినది. సంతతసంతుష్ట నర నారీ సంకులమైన కుసుమపురముయొక్క సాయంతన శోభ మిక్కిలి దర్శనీయమై యున్నది.

శంబలీ దౌత్య పరిసంగంబు లేకయే
 త్యజియించెఁ బ్రణయ క్రోధమ్ముఁ దరుణి
సైరంధ్రులొడలు సింగారింప స్మితముఖా
 బ్జాతమైయుండె స్వేచ్ఛగఁ బురంధ్రి
స్నాతానులిప్తలై చాన లుత్పలనీల
 దృక్కుల సంజ శారీకరింత్రు
ఆశాకచాంత ధూపాళిచేఁ బలె నభో
 భాగము ఘనతమో వ్యాప్తమయ్యె

దీపములు తాము మ్రింగిన తిమిరచయము
మరలఁ గ్రక్కుచునుండె ధూమచ్ఛలమున
ఇరులా నందొంటిఁ బ్రియులిండ్ల కేగుకోమల
కాంచికలు మ్రోయు రాజమార్గములయందు.

ఈరాత్రియందే స్వామి యరుదెంచునుగదా!

అంచిత గూఢమార్గమున నాంతర బాహిర మండలమ్ము సా
ధించిన యోధ నిష్ఠితమతిం గికరించితిఁ జండసేనునిం
ద్రుంచుత నిఁక వాసిఁబతి; దోషము కాదపకారి వైరి వం
చించుట మున్ను మాయఁబవిచే హరి చంపఁడె దుష్టదైత్యులన్.

[అంతట సాన్నాహిక వేషుఁడును సఖుడుడునైన వీరసేనుఁడు ప్రవేశించును]

వీర — చిరకాలమున కిప్పుడేను గుసుమపురమును జేరితిని.

(నిశ్వసించి)
కాల మతిభంగురమ్మయి కడచి చనుట
క్షీణ సంస్కారమైన నాస్మృతి పథమునఁ
జెలగు నిప్పుడు శైశవ చేష్టితములు
జన్మ లన్యమ్ము లవి జని స్మరునికిఁ బలె.

(పరిక్రమించి) అహో! దిగంతరములు టంకచ్ఛేద్యము
లైన తమస్సమూహముచే నిరంతర నిచితము లైనట్లున్నవి.

పరిసర వన్యభూమితల వాంతమటుల రణధూళిధూమ్రమై
యిరులచయమ్ము పెల్లెసఁగు నెంతయు నంతట రాజవీథులన్
గిరిశిఖరాళి నుండి పడిఁ గ్రిందికి నడ్డముగాఁగ సాగు ని
ర్ఝరముల వారి పూరము లసద్యమునాపగఁ దోఁపఁజేసెడిన్.

అగుఁగాక బాల్యము నుండియు నభ్యస్తమైన మార్గముచే

రథకార వేశ్మగతుఁడైన యార్య మంత్రిగుప్తుని దర్శించె దను. (పరిక్రమించి) ఆ రథకార భవన మిదియే. అంగుళి స్ఫోటముచే సంజ్ఞ కావించి లోనికరుగును.

వీర—(సమీపించి) ఆర్యునకు జయమగుఁగాక!

మంత్రి—(కుతూహలముతో) అహో! వీరసేనుఁడా! (ఆతని చేతిని చేతబట్టుకొని) ఇటఁ గూర్చుండుము. (శయనార్థ మును చూపించును.)

వీర—(భూమిమీఁదఁ గూర్చుండును)

మంత్రి—స్వామి ఇప్పుడెచ్చట నున్నాఁడు!

వీర—మార్గమందు

మంత్రి—స్వామి యీరాత్రియే కుసుమపురమునకు రాఁగలఁడా?

వీర—ఆర్య! ప్రాతఃకాలమున

మంత్రి—అట్లా? పరిపార్శ్వవర్తియె; సేనాబల మెంతకలదు?

వీర—దాశేరకబలము వందమందియు, నందక ప్రభృతులైన దౌవారికులును, మీతోఁ గుసుమపురమును జేరుకొనలేని వారును, సవయస్కులైనవారును, సకలబల సందోహ సనాథుఁడైన కుంజరక సేనాపతియును.

మంత్రి—బలే! కుంజరక! సెబాసు.

మిత్రుల కులక్రమాగత
మిత్రత్వము చెడదు జయము మిక్కుటమైనం
బ్రతి జటాయువు దశరథ
పుత్త్రునికై మున్ ప్రియాసువులు విడలేదే?

రాజదుహిత తిరిగి వెళ్లిన పిమ్మట విరహాతురుఁడైన స్వామి యిప్పుడు సన్నాహము నెట్లు ప్రతిపాదింపఁగలఁడు

వీర—ఆ రాజతనయ తిరిగివెళ్లిన యా రోజుననే తమ సమీపమునుండి యాత్యయిక దూతయైన హారిణాశ్వుఁ డరు దెంచెను.

మంత్ర—తరువాత; తరువాత.

వీర—చిరప్రధారితమై పొందఁబడిన యవకాశముచే పెల్లు రేగిన రోషామర్షమునకు వశుఁడై, క్షణకాలము కాంతా వియోగ దుఃఖమును, విస్మరించి శత్రువును గూర్చి తల పోయుచు స్వామి సన్నాహమునే చేయ నుద్యమించెను.

మంత్ర—క్షాత్ర తేజమున కిది సదృశమైనదే; చూడుము.

కోపవహ్ని పరీతమౌ భూపసుతుని
హృదయముఁ దనంతవిడిచెనా యించుబోడి
మధ్య దినసూర్యకర తప్తమధ్యమైన
నబ్జసరసునుగూడ రాయంచ విడదే?

తరువాత నెప్పుడును నాకు స్వామి స్మృతి పథమును జొచ్చి యుండలేదా?

వీర—ఒకప్పుడు పడమటికొండ శిఖరమున వ్రాలు సూర్య బింబము కుంకఁబోవుచుండఁ జెట్లనీడలు పరివృత్తము లగుచుండ, సాయంకాలములందుఁ బిల్లవాయువులు మెల్ల మెల్లఁగా వీచుచుండ స్వామి వైఖానసుని తొడపై నుత్తమాంగమును; నాయంక భాగమునఁ బాదారవిందములను నునిచి చిగురాకు సెజ్జపైఁ బరుండి యాదేవిని స్మరించి,

నిరతాశ్రాంత్రగమ దుర్దినమ్ముల నిశానిర్నిద్ర కాలంబులన్
విరహం బోర్వఁగలేక జక్కవ పడంతిం బోలె నా బాల మ

త్స్మరణంజేసి మనోవ్యథం బొరసె నీమాడ్కిం బ్రలాపించె ని
ష్కారణిం జేష్టలొనర్చె నిట్టులు పనుల్ కావించె నీ మార్గిగన్.

అని బహు విధములఁ బ్రలాపించి యుండెను.

మంత్రి—రాజదుహిత తండ్రి శాసనముచేఁ దిరిగి వెళ్ళిన పిమ్మట, యోగసిద్ధి ఎట్టి సందేశముచే స్వామి నూఱడించి బయలు వెడలినది?

వీర—"ఈవిషయము పూర్వము మదధీనమెయుండెను; ఇప్పుడును నట్లేయున్నది" అని యామాత్రమే చెప్పియుండెను. తరువాత తమ చిత్తము.

మంత్రి—నేనును "భగవతియైన యోగసిద్ధి చెప్పవదాని కర్తవ్యమైన ప్రత్యుత్తర మొసంగఁబడుఁగాక" యని చెప్పి పురోహితసూనుఁడైన యార్యరక్షితునిఁ బంపియుంటిని.

వీర—ప్రయోజన మిప్పు డనుకూలముగా, సిద్ధినొందుచున్నదా!

మంత్రి— మధురేశ్వరుఁడు స్వయముగానే తనకూఁతును, స్వామికొసంగునట్లు భగవతి యోగసిద్ధియే ప్రయత్నము చేయఁగలదు. అందుచేఁ బ్రతిపన్న రాజ్యాభిషేకుఁడైన స్వామినిఁ దలవనితలంపుగా సమకూడిన ప్రియాసమాగ మోత్సవముచే సంతోషపఱచెదను. చూడుము.

తలవని తలంపుగాఁగ సంధిలినయట్టి
సంగమము దంపతుల కతి సౌఖ్యమొసఁగు
నమరపరివృఢు నాధిరాజ్యమ్ము సైత
మందు నూఱవ పాలితో నంద దుపమ.

(నేపథ్యమున గొప్ప కలకలము)

ఇరుపురుసు—అహో! శబ్దమువలె వినిపించుచున్నది.

(మరల నేపథ్యమందు)

ఓపాటలీ పుత్రిపౌరులారా! మీరు వినుఁడు.

తారకపాళిచే శశి విధంబున శ్రీమదమాత్య సింహా స
ద్వారముచేఁ బరీతుఁడయి వచ్చె జగన్నుత మాగధాన్వయాం
కూరము శ్రీనికేతన మకుంఠిత తేజుఁడు రాజపుత్రికుం
డారయువచ్చు రక్తజను లందఱికిం గనువిందుఁ గూర్చుచున్.

మంత్రి—(రభసమున లేచి)

జయమగు విజయాదేవికి
జయమగు నాకౌకసులకు జయము శివునికిన్
జయము భగవంతులకు శ్రీ
మయులకు వాతాశనేంద్ర మానాథులకున్.

ఎవరక్కడ?

[చేటుఁడు ప్రవేశించును.]

చేటు—ఆర్య! నేను సంగతకుఁడను.

మంత్రి—సౌమ్యుఁడా! త్వరిత తరముగా నిటనుండి యేగి శూలపాణి సిద్ధాయతన సంజ్ఞా పటహామును మోయించి "మనమిప్పుడు రాజకార్యమును నెఱవేర్చితిమి. ఇఁకముందు గొప్పయుద్ధము కావలసి యున్నది. అందుచే నిది కర్మకుశలులైన యాయుధజీవులకుఁ దగినకాల"మని యుద్ఘోషింపుము.

చేటు—(ఆర్యుఁ డాజ్ఞాపించినట్లే) అని నిష్క్రమించును.

(ఇరుపురుసు బరిక్రమింతురు.)

వీర — అహో! రాత్రి తెల్లవాఱు చున్నది.

తరుణ భాస్కర కిరణ సంతాడితమయి
పశ్చిమాంభోధి కెరటాలపైని పడిన
తిమిర మరయంగఁ బడు బహిర్గమితమైన
బాడబానల తతధూమ వలయమువలె.

మంత్రి — అహో! దివస మారంభమైనది.

జలధిన్ స్నానముచేసి వచ్చి రవి నక్షత్రప్రసూనావళీ
విలసద్వారిధరాధ్వ భూరుహమునన్ వెల్గొందునాశాంతశా
ఖలకుం జాచి సుదీర్ఘతామ్రము లసంఖ్యంబుల్ కరంబుల్ మనో
జ్ఞలతాంతమ్ములు కోయఁగా దివి రెడిన్ సంధ్యన్ సమర్పింపఁగన్.

(అందఱును నిష్క్రమింతురు)

చతుర్థాంకము. సమాప్తము

---

# శ్రీ కౌముదీ మహోత్సవము



## పంచమాంకము

---

[అంతట లోకాక్షి ప్రవేశించును.]

లోకా— భాగ్యవశమున కుమారకళ్యాణ వర్మ ప్రతిలబ్ధరాజ్యాభిషేకుఁడైనాఁడు. చండవర్మ హాతకుఁడు నిహతుఁడైనాఁడు. ఏలయన?

పాడుకొల్పి వర్ణాశ్రమ పథము మరలఁ
గూల్చి చండసేన నృపతి కులమునెల్ల
నాధిరాజ్యమునందు కల్యాణవర్మ
కంజలింతుర్ కల్పకమున కట్లు ప్రజలు.

(పరిక్రమించి) అహో! "విటజనాభ్యర్చితుఁడైన కర్ణీపుత్రునికీర్తిస్తంభములచే నలంకృతములైనవా?" యన్నట్లున్న రాజమార్గములతోఁ గుసుమపుర వేశము మిక్కిలి రమణీయమై యున్నది. ఇట-

మత్తకోకిల

వెలవెలందుల సంగతింగన్ఁ బేశలమ్మను వంచకా
వళుల కిక్కయునైన జారుల వర్ధమాన సమాజమున్
లలితగోష్ఠులఁ జిత్రవేషముల న్వహించి మహోక్షముల్
కలమనోహర హుంకృతి ధ్వనుల న్విడంబన చేసెడిన్.

(చూచి) అదుగో పురాణవిటుఁడైన వేశరక్షితుఁడు.

శరతల్పగతుఁడైన శాంతనవునివలె వేశవాట మకరకేతు మందిరావసన్నుఁడై కానిపించుచున్నాఁడు. ఏలయన?

సాకేతమున ననాసాదిక కౌతుకుం
డభిసారితుండు పంపాఖ్యపురిని
గాంచి కాంతా లసత్కాంచికా వికలితుం
డాక్షేపితుండు సింహపురమందు
వైదిశంబునఁ బరివార విజ్ఞాపితుం
డుజ్జైనిఁ బణ్యకాంతోద్ధృతుండు
నలకటాహమున గోత్రాంతర స్థలితుండు
కుండినంబునఁ బరిముండితుండు
నగుచు సుచిరమ్ము పణ్యాంగ నాళిపాలి
నికష శిలయని చాల వన్నియ గడించి
ముప్పునఁ బతివ్రతాత్వమ్ము పూను చాన
విధిని నిష్ఠాగరిష్ఠుఁడై వెలయు నిపుడు

వేశ—(ప్రవేశించి) అహో! విధాతృహతకా! నీవు కడు నసదృశ సంయోగకారివి గదా! చూడుము.

జలరుహసంభవ మున్నా
వళులకు ముందరుగుదెంచు వయసులతోడన్
లలిత విలాసుల కరిగిన
యెలఁ బ్రాయముతోడ భేద మీక్షింపవుగా!

లోకా—(సమీపించి) భావ! ఏకాగ్రచిత్తుఁడవై చింతించు చుంటివి చేనిని?

వేశ—ఓహో! అక్షదాసుఁడైన లోకాక్షియా?

వేశవిలాసినీతతికి వేడ్కరహస్యనంగాన్క లిచ్చుటల్
నైశ ఘనాంధకారముల నచ్చినసాహసముల్ పొనర్చుటల్
వేశమున న్సుహృద్వరులఁబిల్చి యదీయది ముచ్చటించుటల్
పాసిన జవ్వనంపు సుఖవర్గము లిట్టివి సంస్మరించెదన్॥.

లోకా—విషయములు పర్యంత పరిహారణీయములని పెద్దలం
దురు. విశేషించి వేశవాసము; ఏలయన?

దాతను సుప్రయోగచణు ధార్మికు యౌవనరూపవంతునిం
బ్రీతియుతున్ దరస్మిత పరీతవచస్కుని సంపదాఢ్యునిం
జాతురి మీఱువానిఁ బురుషప్రవరున్ విడి వేశ్యగ్రంధి దు
ర్ఖ్యాతి నవంతి మాషవిభవున్ గడునీచుని సంస్తుతించెదున్.

వేశ—శ్రోత్రియ మార్గానుసారి వైన నీవిట్లేయందువు. భోగ
విముఖమైన నీమనస్సునకు విరాగమే రుచించును. కాని యది
యాలోచనా శూన్యతచేతఁ జూడుము.

వారవిలాసినీ మధుర వాగ్వర సూత్ర సముచ్చయాస్పదం
బైరహియించు వేశమున యౌవనమున్ వెడలించి స్వేచ్ఛమై
వారక వార్ధకంబున నపారము లాసుఖముల్ స్మరించు చో
ప్పారు విటోత్తముండు పరమార్థము తత్త్వముఁ బొందకుండునే?

సరే? యీ కథ యటుండ నిమ్ము. నీవు చిరకాలమునకుఁ
గానిపించితివి. కారణమేమి?

లోకా—ఒకానొక కారణముచే శూరసేన మధురకేగి తిరిగి
వచ్చితిని.

వేశ—అచ్చట విశేషమేమైనఁ గలదా?

లోకా—కలదు. యదునాథుఁడు తనకూఁతురు కీర్తిమతిని

స్వీయముగానే మనస్వామియైన కళ్యాణవర్మ కిచ్చుటకుఁ బ్రయత్నించుచు చున్నాఁడు.

వేశ—ఈ రాజ కులములు రెండును బరస్పర సంబంధమున కర్హములై యున్నవి. కాని యీ విషయమున నుపోద్ఘాతమైనవా రెవ్వరు?

లోకా—భగవతియైన వింధ్యవాసినియే.

వేశ—ఏకానంగ యాదవులకుఁ గులదైవతము కదా! అటు పిమ్మట.

లోకా—కీర్తిషేణ రాజకులమందు యోగసిద్ధి యను పేరుగల పరమ సమ్మతురాలైన యొకపరివ్రాజిక కలదు. ఆమె యొకప్పుడు జామాతృ విశేషమును గూర్చి రహస్యముగా దేవితో నాలోచించుచున్న రాజు నొకచిత్రపటముతో సమీపించినది. ఆ చిత్రపటమునఁ గీర్తిమతీ కళ్యాణవర్మల చిత్రపటములు రెండును జిత్రితములై యుండెను. అంత రాజిదియే మని యడుగ నామె 'చిత్రగతులైన వీరికి దాంపత్యము సంఘటింప వలె'ననెడి యేకానంగాదేవి యను శాసనము నెఱింగించి యుండెను.

వేశ—ఏమి? ఇదియేటు! భగవతి యేవిధముగాఁ జెప్పినది?

లోకా—వినుము ఆనాఁడు రాత్రికాఁగానే.

కలమ కణిశాభమును గౌ
రిన్నెల కళతలఁ దాల్చి దేహ నిచితిభసితమై
వలిమల కూరిమి సుత శ
మ్ములనగు నేత్రములతోడఁ బొడగట్టెఁ గలన్.

తరువాత నామె.

మహిత శౌనకునకు బుద్ధిమతి విధాన
రమ్యుఁ డవిమారకునకుఁ గురంగివోలె
మూర్త సద్గుణపుంజ మీ కీర్తిమతియు
ననఘ! కల్యాణ వర్మాభిధునకుఁ దగును.

అని యీ పద్యమును జదివి, చిత్రపటము నొసంగి తత్క్షణమే యదృశ్యురాలయ్యెను. పరివ్రాజిక నిద్రలోఁ జేత గ్రహించిన యీచిత్రపటము మేల్కొనిన తరువాతఁ గూడ నామెచేతనే యుండెను.

వేశ—భగవతి ప్రసన్నయైనది. దైవతములు బహ్వాశ్చర్యములుకదా! అటుపిమ్మట.

లోకా—పిమ్మట నట్టి స్థితియందు మనస్వామి పురోహితుని కుమారుఁడైన యార్య రక్షితుఁడు కన్యావరణార్థమై రాజకులమున కేగియుండెను. అంత యదునాథుఁడు మంత్రులతోఁ గలసి యాలోచించి యిదియంతయు దైవ నిర్మితమని, కృతనిశ్చయుఁ డాయెను.

వేశ—అహో! స్వామి కల్యాణవర్మ కభ్యుదయ పరంపరలు జట్టుగా సమకూడుచున్నవి.

(నేపథ్యమందు)

ఓ కుసుమపురవాసులైన పౌరులారా! మీరు మంత్రి మహత్తరుఁడైన మంత్రిగుప్తుని వచనము లాలకింతురు గాక! కుసుమపురమున నిత్యమును నుత్సవమే యయ్యును నీనాఁడు మహోత్సవ మాదేశింపఁబడుచున్నది. ఏలన?

సదమల మున్నతమ్మయిన సౌధము నగ్రమునెక్కి భూవిభుం
డుదిత విశేష సంభ్రమ సముత్కటమౌపురిఁ జూడఁ గోరెడిఁ

ఉదయ నగేంద్రకూటమున నుండి శశాంకుడు దీయమానుఁడై
ముదమునను చ్ఛలోర్మియయిపొంగులు వారుసముద్రమున్వలెన్

లోకా—రాజ్యలాభ సభాజన మిషమున శూరసేన సచివులు రాజదుహితం గొని వచ్చుటచే నీయుత్సవము సమాదిష్టమైనదని తలంచెదను. అందుచే నేనును మహోత్సవమును జూడనరిగెదను.

వేశ—సరే! నీ వరుగుము.

(నిష్క్రమింతురు)

(ఇది విష్కంభకము)

[అంతఁ బరివ్రాజిక ప్రవేశించును.]

పరి—సాధు! సాధు! మంత్రిగుప్త మార్గానుసారిణినైన నేను బురుషాధిష్ఠితమైన ప్రకృతివలె నీ విధముగాఁ గుమార కళ్యాణవర్మ కభ్యుదయముఁ గలిగింపఁజాలితిని. ఏలన-

అనుగుం గొమరిత భూపతి,
తనయంతనె మాన్నృపాల తనయునకిచ్చెన్.

(విమర్శించి)

ఘనమగు దేవి యనుగ్రహ
మునఁ జేకుఱె నిద్ది; యామె మూర్త దయ కదా!

కాని, కృతమంగళుఁడైన రాజును వంచించితినిగదా యని నా హృదయమున నొకించుక సంతాపము కలుగుచున్నది.

అనుగుణుండైన మగధ రాజాత్మజాతు
తోడ నాతని ముద్దుఁగూఁతును ఘటించి

యదుకుల వివృద్ధిచేయు నా యత్నమునను
వంచితుండయ్యె నాతేఁ డవంచితుండె.

కుమారి కీర్తిమతి నిపుణికతోఁగూడ వివిక్తమైన ప్రమద వనమునం దున్నది. మొదట మహామంత్రి వచనముచే మగధేశ్వరుఁడును, పిమ్మటఁ బురోహితునిచేఁ గుమారి యును నభినందింపఁదగి యున్నారు. అందుచే నేనిప్పుడేగి మంత్రివర్యుఁడైన మంత్రిగుప్తుని సందర్శించెదను.

(నిష్క్రమించును.)

[అంతట రాజవిదూషకులు ప్రవేశింతురు]

రాజు—(నిశ్వసించి)

నామిత్రులైరి భూపతులు నవ్యము గద్దె లభించె నంబుధి
స్వామిని బోలు నాహినియుఁ బాటలిపుత్రి పురమ్ము చేపడెన్
శ్రీమహితమ్ము మధ్యమ కుభృత్కుకుదమ్ము గు ఛత్రమబ్బె నా
భూమిభృదాత్మజాకరము పొందని నాకివియన్ని వ్యర్థముల్.

విదూ—మిత్రమా! సంతాపముఁ బొందకుము. ఆశనొందుట కవకాశము లేకపోలేదు. శూరసేన నాథ పురోహితుఁడు పెక్కు పారితోషికములతో నిన్నుఁ జూడ రానున్నాఁడు.

రాజు—ఇది యాశాస్థానమే; మున్ను నా తండ్రికి శూరసేన నాథుఁడు మిక్కిలి మిత్రుఁడై యుండెను. అందుచే నాతండు నారాజ్యలాభమును విని నన్నభినందింపఁ బురోహితునిఁ బంపి యున్నాఁడని తలంచెను.

దౌవారికుఁడు—[ప్రవేశించి] మహారాజునకు జయమగుఁగాక. శూరసేననాథ పురోహితుఁడు ద్వారమున వేచియున్నాఁడు.

రాజు—అవిలంబితముగా నాతనిఁ బ్రవేశపెట్టుము.
దౌవారికుఁడు—దేవర యాజ్ఞ ప్రకారము చేసెదను.
(నిష్క్రమించును.)

(అంతఁబురోహితుఁడును దౌవారికుఁడును బ్రవేశింతురు)

పురో—(తనలో) ముందురాజు నభినందించి పిమ్మట మంత్రగుప్తునితోడను, యోగసిద్ధితోడనుగూడి కుమారి విషయమునంతను సమర్థించెను. సాధు! సాధు!

సృచము సామమ్ముతో బలె క్షితిపతి సుత
మగధ రాజాత్మజాతుతోఁదగ ఘటించి
సమగుణ వధూవరులఁగూర్పఁ జాలె ననెడి
సాధు వాదముపొందె నబ్జాతయోని.

దౌవా- ఆర్యుఁడిట్లు వచ్చుఁగాక. (ఇరువురును బరిక్రమింతురు)

విదూ—మిత్రమా! ఇది మిక్కిలి యనుచితముగా నున్నది. పూజ్యురాలైన యా రాజపుత్రి చిత్తము కడు విరహావిధురమైయున్నది; నీ హృదయము పనిలేకయే సంతపించుచున్నది.

రాజు—మూర్ఖ! మిక్కిలి తెలివితక్కువగాఁ బల్కితివి.
క్ష్మాధరమువోలె దుర్గ్రహాకారమైన
కాంత యెడఁబాటువలని దుఃఖము భరించు
నట్టి నాకుఁ గందుక లఘువయ్యె రాజ్య
మధికభార మ్మటులుతోఁచు ననుఁగు సఖుఁడ!

పురో—(సమీపించి) దేవరకు జయమగుఁగాక.

కాశసుమాస వార్ద్రములు, క్ష్మాధరరాజసుతారతిశ్రమాశ్వాస విధాన శేషముల, సాంబశివుండు నిజోత్తమాంగ, సం

భాసితయామినీరమణ భవ్యకళాగళితామృతంబులన్
జేసెదుఁ గాతయోగ్యునకు నీకుఁ జిరన్ క్రమమహాభిషేకముల్

రాజు—పూజ్యునకాసనము

దౌవా—ఆసనమిదిగో ! ఆర్యుఁడిందుఁగూర్చుండుఁగాక.

(ఇరువురును గూర్చుండుదురు)

రాజు—శూరసేనేశ్వరుఁడు కుశలి యై యున్నాఁడా ?

పురో—కుశలియైన కీర్తిషేణుఁడిప్పుడు దేవర యనామయ వార్త నెఱుంగఁగోరుచున్నాఁడు. నే నాయన సందేశమును గొనివచ్చితి.

రాజు—ప్రభువేమని యాజ్ఞాపించుచున్నాఁడు?

పురో—కీర్తిషేణుఁడు నిన్ను గూర్చి యిట్లు పలుకుచున్నాఁడు.
వత్సా ! కల్యాణవర్మ !

నినుఁగని మగధావని నా
ధునిపత్ని సుపుత్త్రియయ్యెఁ దోరపుశుభముల్
గొనుము చిరంజీవివి యయి
కనఁజాలితి పుష్పపురము ఘన భాగ్యమునన్

మఱియు,

ఇరువురి యురముల రెండును
బరిష్కరింపఁ గలవంచు భావింతు మదిన్
హరియురముఁ గౌస్తుభము భా
స్వర హారము మగధరాజ్య పరివృఢు నురమున్.

అని నీ కొఱకే హారమును బంపియున్నాఁడు.

(విదూషకునిచేత హారము నుంచును.)

విదూ — (అపహరించి) ఇదిగో హారము చూడుము.

రాజు — (కుతూహలముతో హారమును జూచును.)

పురో — దేవరదృష్టి సకుతూహలమువోలె నున్నది. ఈ హార రత్నము శూరసేన రాజకుల సర్వస్వమని చెప్పఁదగినది. ఇది లభించిన విధ మెఱుంగఁ గుతూహలము కలదేని నుడివెదను.

రాజు — మాకుఁ జాలఁ గుతూహలము కలదు.

పురో — దేవర విందురుగాక; అప్పుడు మహాభారత యుద్ధము జరుగుచుండఁగా;

కరయుగ్మాస్త్ర శరాళిమై మును విపక్షవ్యూహ విచ్ఛేదన
స్థిర శౌర్యుండు నరుండు రూపరఁగఁ జేసె న్సుప్రతీకాఖ్యమా
కరిఁ, దత్కుంభ సముద్భవమ్ములను నక్షత్రచ్ఛవి స్పర్ధలన్
హారహాస ప్రభలన్ రచింపఁబడె నీ హారమ్ము ముత్తెమ్ములన్.

రాజు — అహో! అపూర్వమైన యీ రత్నహారము వీరజన స్పృహణీయమైనది.

పురో — పిమ్మట,

యాదవకన్యకా కుచతటాంచిత కుంకుమ తామ్రమాట, నా
తోన్నదిత విక్షతి ప్రకరమో యనునట్టులు కానిపించు న
య్యాది కిరాత శస్త్ర నివహార్పిత చిహ్నతతి న్విలీనమై
శ్రీదము హార మిద్ది కయి సేసెఁ గిరీటి వెడందవక్షమున్.

రాజు — సంభవానురూపమైన వినియోగము! తరువాత, తరువాత.

పురో — పిమ్మట వృష్ణికుల మా విధముగా నంతరింప ద్వారకా

నగమరంబురాశిగ్రస్తముకాఁగాఁ బరీక్షితునిఁ బట్టాభిషిక్తుని గావించి వానప్రస్థము స్వీకరింప నుద్దేశించిన రాజర్షి యుధిష్ఠిరుని యానతిచే ధనంజయుఁడు పంచాభిధానుఁడైన వృష్ణి కుమారుని శూరసేన దేశమునకుఁ బట్టాభిషిక్తునిఁ జేయుచు నీహారము నాతని కర్పించెను. తరువాత నది పారంపర్యముగాఁ గీర్తిషేణునకు లభించినది. నీకు భద్రమగుఁగాక.

రాజు—(అశ్రుపూరిత నేత్రుఁడై హారము నీక్షించును)

పురో—ఇది యేమి? హారదర్శనముచే దేవర పర్యశ్రునయనుఁ డగుచున్నాఁడు?

విదూ—పుణ్యశ్లోకులైన యాజమీఢుల సంకీర్తనము వలన నెవ్వరి కశ్రు సంపాతము కాదు? వారు ధరించిన యపూర్వాభరణము యొక్క దర్శనము కలిగినప్పు డింక వేఱుగాఁ జెప్ప నేల?

పురో—అగును. ఇది యుచితమే.

రాజు—ఆచార్యుఁడు విశ్రమించునుగాక. నందకా! మంత్రి గుప్తునితో నామాటగా నిట్లనుము:—"విశ్రాంత సుఖమైన యార్యుని జూడఁగోరుచున్నా"నని.

నంద—మహారా జాజ్ఞాపించునట్లు.

పురో—(నందకునితో నిష్క్రమించును)

విదూ—ఇప్పుడు చేయవలసిన దేమి?

రాజు—(హారమురమునసుంచి) మిత్రమా! హారదర్శనముచే నాకు మదన సంతాపము రెట్టింపుగా నుద్రిక్తమగుచున్నది. చూడుము.

యదు నృపతి తనయ నాచే
ముదమున మాయయును బోలెఁ బొందఁబడిన య

య్యాదనేల్లఁ గడచియును ని
య్యాదమునఁ గ్రిమ్మఱఁగ వచ్చినట్టులు తోఁచున్.

పర్యుత్సుకమైన నాహృదయము నెచ్చట వినోదపెట్టఁ గలను.

విదూ—భోజనశాలకుఁగాని మహానసశాలకుఁగాని పోవుదము.

రాజు—పరిహాసమును విడువుము.

తొలుతం బొక్కిలి బావిలోన దిగి తోడ్తో రోమరేఖాపథిన్
లలితోత్తుంగ కుచాద్రులెక్కి యవలీలన్ దంతవాసోమణి
చ్ఛల నీరాజన లబ్ధతేజమయి యాచంద్రాస్య కీర్తిఁగంటి చూ
పులతో నా మెయి చొచ్చి మారకరియొప్పన్ దుర్నివారమ్ముగన్

మఱియు,

ప్రేయసీ విరహానలాభిప్రతప్త
మైన మచ్చిత్తమునఁ ద్రినేత్రవైరుఁ
డంగజుఁడు తనమేను దాహక్షమమ్ము
నొనరుప ననంగఁ జేయు దాహోద్యమమ్ము

విదూ—అగుఁగాక ప్రమదవనమునే ప్రవేశింతము.

రాజు—ముందునడువుము (ఇరువురును బరిక్రమింతురు)

విదూ—ప్రమదవనమును బ్రవేశించితిమి. ఇంక నీ యాత్మను వినోదపఱుచుకొనుము.

రాజు—పరోక్షమైన మదనాతంకము చికిత్స నతిక్రమించునట్టిది కదా ! చూడుము.

ఎదుటం బ్రక్కలనున్నటుల్ పగలు రేయెక్కాలమున్ మున్ను నె
మ్మదికిందోఁచిన కాంత యిప్పు డెదుటం బ్రత్యక్షసందృష్టయా

హృదినైన న్విరహోచితార్తియెసఁగున్ హృద్యార్థ విద్వేషియై
"విదితాత్యంత విచిత్రరీతులు కదా వేధోవిధానావళుల్."

విదూ—సుభగములును వికసితములును నగు గ్రీష్మకాల మల్లికా ప్రసూనములచే నట్టహాసము చేయుచున్నట్లున్న యీ లతాగృహమును బ్రవేశింతము.

రాజు— అట్లే చేయుదము (ఇరువురును బ్రవేశింతురు) ఓ! కృతాంతహతకా! నీవు మిక్కిలి యసదృశ సంయోగ కారివిగదా!

ఏ నిశి, విప్రయోగ సమ వేతతఁజేసి చెలంగు దీర్ఘమై
యా నిశియే, సమాగమ మహామహ సంపద నేఁగ్రక్కునన్
పూని విధాత! యీ యుభయము న్విపరీతము చేసితేని, ల
బ్ధానునయాత్ములై విరహమందును దిట్టరు నిన్ను దంపతుల్.

[చింతాక్రాంతుఁడై శిలాతలమునఁ గూర్చుండును. అంతటఁ గీర్తిమతియు, నిపుణికయుఁ బ్రవేశింతురు.]

నిపు—భర్తృదారికా! రాజకుమారుఁడడుగో! కన్నులారఁ జూడుము.

కీర్తి—ఆర్యపుత్రుఁడా?

నిపు—(చిత్రపటమునుఁ జూపును)

కీర్తి—(చూచి యసూయతతో వెనుకకుఁ దిరుగును)

నిపు—ఏమిది?

కీర్తి—సఖీ! ఈతఁడు మిగుల దుర్జనుఁడు. విరహవేదనచే నింత కాలము కృశించుచున్న నన్ను మఱచి యింకొక చానతోఁ గ్రీడించుచుఁ గానిపించుచున్నాఁడు.

నిపు—(తనలో) నిరంతర ప్రియస్మరణ చిత్తయగుటచేఁ జిత్రగతుఁడైన యాతని మాత్రము గుర్తించి భర్తృదారిక తన ప్రతికృతి యన్యస్త్రీ ప్రతికృతి యని భ్రమించుచున్నది. (ప్రకాశముగా) నీయొక్క ప్రతికృతిచేతనే వంచింపఁబడిన దానవై

కీర్తి—అయ్యో! అపరాధము కావించితిని (అని సలజ్జయై యుండును.)

నిపు—భర్తృదారిక రాజపుత్త్రినిఁ జూచుఁగాక.

కీర్తి—సఖీ! ఎచ్చటఁ గూర్చుండి సావకాశముగా నార్యపుత్త్రిని ప్రతికృతిని జూచుచుఁ జిత్తము నానందింపఁజేసికొందును?

నిపు—ఇదిగో! ముందర నొక లతాగృహ మున్నది. అందుఁ జొత్తము.

విదూ—నీవేమి యాలోచించుచుంటివి?

నిపు—సఖీ! లతాగృహాభ్యంతరమం దార్యవైఖానసుని యెలుంగువలె వినవచ్చుచున్నది. లతాశాఖల మధ్య నుండి చూతము.

కీర్తి—అట్లే చేయుదము. (అట్లు చేయుదురు.)

నిపు—అహో! భర్తకూడ నచ్చట నున్నాఁడు!

కీర్తి—భర్తకాదు. నే నాతని సమీపమున నుండను.

(తిరిగిపోవుట కారంభించును.)

నిపు—ప్రియప్రతికృతి దర్శనముచే వంచితురాలవైతివి కదా!

కీర్తి—పిచ్చిదానా! ఆతఁడు రాకాచంద్రుని సిగ్గిలఁజేయు. మహారాజెట్లగును?

నిపు—నీయెడబాటుచేఁ గృశించిన శరీరముగల రాజ
పుత్త్రుని ముఖశోభ ప్రత్యూష చంద్రసదృశమై పో
యినది. ఆతని చెంత నార్య వైఖానసుఁ డేదో మాట్లాడు
చున్నాఁడు.

విదూ—ఒంటరిగా జంబుకమువలె నాక్రోశించుచుఁ బ్రకాశింప
కున్నావు. అందుచేఁ బ్రత్యుత్తరమిమ్ము.

రాజు—మిత్రమా! వైఖానసా!

కీర్తి—అహో! ఆర్యపుత్రుఁడే; సఖీ! ముందు నడువుము.

నిపు—భర్తృదారికా! నావెనుక దాఁగనెంచెద వేల? సర్వాం
గీణమైన రోమాంచ కంచుకము నీమేన నున్నది కదా!

కీర్తి—సఖీ! నన్నేల సిగ్గిలఁ జేసెదవు?

రాజు—ప్రియురాలి ప్రథమ సమాగమమును గూర్చియే
చింతించు చున్నాను.

నలిన సుంగధిలోలనయనంబును, విద్రుమపాట లోష్ఠముం
బులకితగండ భాగమును, మోమును, ముద్దిడ నెత్తినంతనే
లలనయు ముద్దరాలగుట లజ్జ నిషేధపుమాట లాడి తా
మ్రలలితమాకరాగ్రమున మన్నయనద్వయిఁ గప్పె వెన్కగా.

మఱియు నప్పుడే యొక నాఁడు నేను జెంతనేయుండ
తనసఖిమోసపుచ్చి ప్రమదంబునఁ దామర తేనె లాని య
న్ననఁ బరకాంత వేఁడుచు వినోదము సల్పెడు గండుఁదుమ్మెదం
గని చెలి సాశ్రునేత్రి పరికల్పిత భ్రూకుటి సానురాగయై
మనిచిన నెయ్యపుంగినుక మానసమందుఁ దలంచి కుందెదన్.

విదూ—మిత్రమా! ఒకరాజ కార్యమును గూర్చి ముచ్చటిం
చెదను.

రాజు—రహస్యముగా.

విదూ—ప్రాప్తరాజ్యులమైన మనము హాయిగాఁ దిని త్రాఁగి కూర్చుండుట యుచితము. ఇంకనతి క్రాంతమైన యా స్త్రీ వృత్తాంత మెందుకు?

రాజు—ఛీ! మూర్ఖుఁడా!

నిపు—ఛీ! దుష్టవటుకా! తొలఁగిపొమ్ము. తొలఁగిపొమ్ము. నీవు రాజవైనప్పు డిట్టివే రాజ కార్యములు.

కీర్తి—(చిఱునవ్వు నవ్వును)

రాజు — ప్రేయసీ!

హృదయము నిన్నుఁగూడి విహరించుచు హాయినెసంగుచున్నా
యదియగు నేత్రయుగ్మము కృతార్థము కాదని వంతనొందెదన్
సదమలగాత్రి! కోరిక లసంఖ్యముగా నెఱవేరుచున్న స
న్మదమెటు కల్గెడిన్ స్వజనముం బెడఁ బాసెడి మానవాళికిన్.

నిపు— భర్తృదారికా! భర్త యతికరుణముగా విలపించు చున్నాఁడు.

కీర్తి—నాకేమనుటకును దోఁపకున్నయది.

నిపు— ఈ చిత్రపటమును భర్తృసమక్షమునకు విసరెదను. (అట్లుచేయును)

విదూ—అమ్మో! సర్పము! సర్పము! పింఛితభోగమండల మును, వాలధి బహుకోృడ విషముమునై యిచ్చటఁబడినది.

రాజు— (నిరూపించి) మిత్రమా! యిది యా చిత్రపటము! దానిని గ్రహింపుము.

విదూ—హీం! హీం! ఇది సర్పముకాదు. చిత్రపటమే దీనిని గ్రహించెదను.

రాజు—ఈ చిత్రపట మెచ్చటనుండి వచ్చినది ? లతాగృహ మునుండి. బయల్వెడలి; తెలిసికొందము.

(ఇరువురును బయటికి వత్తురు)

నిపు—దేవరకు జయమగుఁగాక

కీర్తి—ఆర్యపుత్త్రునకు జయమగుఁగాక.

(ఇరువురును నమస్కరింతురు. రాజుకీర్తి మతిని లేవనెత్తి కౌఁగిలించుకొనును)

రాజు—మన కభ్యుదయ విశేషమనఁగా నెట్టిది ? మిత్రమా వైఖానసా !

చెలినెదుటఁ గాంచుచున్నను!
గలుగదు ప్రత్యయము వంతఁ గలఁగెడి నాకున్
బలుసారులు తలపుల చూ
పులఁబడియుచు నామె మోస పుచ్చినకతనన్

విదూ—ఇది సత్యమా కాదా యని సర్వాంగీణమైన రోమాంచ మునే పృచ్ఛింపుము.

నిపు—భాగ్యవశమున భర్తృదారిక ప్రతిపన్నరాజ శబ్దుఁడైన భర్తను జూడఁగల్గినది.

రాజు—(సహర్షముగా) ఓసీ! నిపుణికా!

ధారుణీ పాలకులకు విస్తార భోగ
సంపదలఁజేసి తఱుచు విస్మయముకల్గుఁ
గాని మీ కీర్తిమతియె నిక్కంపు లక్ష్మి
మాకనుచుఁగొందు మేము విస్మయము చాల.

(అపవారించి) మిత్రమా ! వైఖానసా! ఈ విషయము మనకుఁ దెలియనే తెలియదుకదా!

విదూ—మనకుఁ దెలియకపోయినను మంత్రిగుప్తునకుఁ దెలియును.

రాజు—సాధు! మంత్రిగుప్త! సాధు! ప్రభువును లెస్సగా
నారాధించినాడవు. మిత్రమా! వైఖానసా!
శుక్రుడు విభూతి రాక్షసేశునకు మాదిరి
మాధవుడు భూరిబలము మన్మథునికి వలె
గురుడు సుప్రబోధము పురందరునికట్లు
నాకు జిరమితుడ్రిడితేడే మొనర్పకుండు?

విదూ—హీ! హీ! అవఘట్టిత దిశాముఖమును సుమారుత మును మేఘవిస్తారమునునై శ్యామాయమానమగుచున్న దినాంత సంధ్య మిక్కిలి భయపెట్టు చున్నది. అందుచే నభ్యంతర గృహమునకు బోవుదము.

కీర్తి—(మేఘధ్వని విని) ఆర్యపుత్ర! రక్షింపుము. (అని సకంపముగా గౌగిలించుకొనును)

రాజు—బాగు బాగు; భ్రాంతినొందినవారమైతిమి. ప్రియసీ! ఈగజఘనసమ యావతారమును వీక్షింపుము.

ఇది విద్యుల్లతకాదు; వారిజదళాక్షీ! జాళువాకక్ష్యయా
నిది పౌరందర చాపచిహ్నవహామా శృంగార రేఖాళి యి
య్యది వర భ్రమకృ తుషారపతనం బాగర్జిఘీంకార మి
ట్లది యైరావణ దంతి కానబడు నయ్యే మేఘ లింగంబులన్.

మఱియు,

హరుడు నటించుగాక, నటనావసరాతత కేశభారుడై
పరిమళ వత్సమావళుల బాదపముల్ ప్రకటించు గావుతన్
దిరిగి ప్రసన్నులై యరుగుదెంచి ప్రియుల్ రమణీ కపోల వి
స్తర విచలత్కచ ప్రతతి చక్కవెసన్ సవరింతు కావుతన్.

(అందరు నిష్క్రమింతురు.)

పంచమాంకము కౌముదీమహోత్సవము సర్వము సమాప్తము.

